# కాకినాడ పురపాలక సంఘ గందరగోళం

## 'అతితెలివి', 'తెలివితక్కువ' అని పరస్పర ఆరోపణలు

### పోలీసుల సహాయంతో కొనసాగింపు

కాకినాడ, సెప్టెంబరు 1: నిన్న సాయంకాలం జరిగిన స్థానిక పురపాలక సంఘ సమావేశంలో గందరగోళం జరగడం వల్ల చర్చించవలసిన విషయాలను చర్చించకుండానే సమావేశాన్ని పూర్తి చేయవలసి వచ్చింది. సమావేశానికి పురపాలక సంఘాధ్యక్షుడు సి. వి. కె. రావుగారు అధ్యక్షత వహించారు.

కార్యక్రమాంశాలను వరసగా పరిశీలనకు తీసుకోనకుండా అధ్యక్షుడు మరొక విషయం చర్చకు తీసుకొన్నారని ప్రతిపక్ష సభ్యులు 20 మంది అభ్యంతరం తెలియచేశారు. కార్యక్రమాంశాలను వరసగా క్రమం ప్రకారం చర్చకు తీసుకొనవలసిందిగా ఎన్. అప్పారావుగారు కోరగా అధ్యక్షుడు అందుకు నిరాకరించడమే కాక, "అది తెలివి తేటలు" అని అప్పారావుగారిని అవహేళన చేశారు. అందుకు "తెలివి తక్కువ" అని జవాబిచ్చారు. అంతట అధ్యక్షుణ్ణి అవమానపరచారనే ఆరోపణతో సమావేశం నుంచి వెళ్ళిపోవలసిందిగా అప్పారావు గారిని అధ్యక్షుడు రావుగారు ఆదేశించారు. అసభ్యంగా మాట్లాడినందుకు అధ్యక్షుడు క్షమాపణ చెప్పుకోవాలనీ, తాను సభనుంచి వెళ్లిపోవలసిన అవసరంలేదనీ అప్పారావుగారు అన్నారు.

### పోలీసు సహాయం అవసరమైనది

దానిమీదట పోలీసులను పిలిపించి వారి సహాయంతో అప్పారావుగారిని సభనుంచి బయటికి పంపిస్తానని అధ్యక్షుడు సి. వి. కె. రావుగారు అన్నారు. అప్పారావుగారు ఆ సవాలును అంగీకరించారు. అధ్యక్షుని కోరికగా కమీషనరు పోలీసులను పంపించారు.

ఈలోగా "అధ్యక్షుని అసమర్థత వల్లనూ, జబర్దస్తీ వల్లనూ సమావేశం అవ్యాఘాత పరిస్థితులలోకి వచ్చినందున" అంటూ కస్తూరి వెంకటచలంగారు సభను వాయిదా వెయ్యాలని కోరే తీర్మానం ఒకటి ప్రతిపాదించారు. ఆ తీర్మానం తీసుకోవడానికి అధ్యక్షుడు నిరాకరించగా కమీషనరుకు దాన్ని అందచేశారు.

### పోలీసులు సర్దుబాటు చేశారు

ఇంతలో బయట గుమిగూడిన జనమంతా హాలులోకి వచ్చారు. పోలీసులు వచ్చి లోపలి వారిని సర్ది బయటికి పంపించారు

ఫుట్‌బాల్ ఆటగాడు భద్రయ్యగారు కృష్ణానదిలో యిటీవల జరిగిన లాంచి ప్రమాదంలో మరణించినందుకు సంతాపసూచకంగా సభను వాయిదా వెయ్యాలని కోరుతూ కోమూరి కృష్ణారావుగారు ఒక తీర్మానం ప్రతిపాదించగా సభ్యులందరూ అంగీకరించారు. ఈ విధంగా ఒక్క నిమిషం కూడా చర్చ జరగకుండానే సమావేశం ముగిసింది.

## పత్రికలకు నిగ్రహం అవసరం

### శ్రీ పంత్ హితవు

న్యూఢిల్లీ సెప్టెంబరు 1: పత్రికలు తమ అభిప్రాయ ప్రకటనా స్వాతంత్ర్యాన్ని కొంత నిగ్రహంతో వినియోగించుకోవాలని దేశీయాంగ మంత్రి శ్రీ గోవిందవల్లభపంత్ ఇవ్వాళ ఇక్కడ అన్నారు. హాక్కు, బాధ్యత ఇంజన్లో నీరు, బ్రేకు మాదిరిగా ఉపయోగింపబడాలని ఆయన అన్నారు.

శ్రీ పంత్ ఒక కొత్తహిందీ దినపత్రికను ప్రారంభోత్సవం చేశారు. ఈ పత్రికకు ఢిల్లీ రాష్ట్రానికి ఇదివరలో మంత్రిగా వుండిన గోపీనాథ్ అమన్ సంపాదకుడు.

గాలి వార్తలు, నిందా ప్రచారం ప్రధానంగా వుండే ప్రతికారచన మన దేశంలో ఈ మధ్యనే తలఎత్తిందనీ, ఇది దేశహితం కోసమే కాక, పత్రికా రచనా వృత్తి గౌరవం కాపాడేందుకు కూడా ఈ విధమైన పత్రికా రచనను అంతం చేయాలనీ, అందుకు కొన్ని శాసనపు ఏర్పాట్లు అవసరమనీ శ్రీ పంత్ అన్నారు. పత్రికా పరిశ్రమ బాధ్యత తెలిసిన వారి చేతుల్లో వుండటం అవసరమని కూడా శ్రీ పంత్ అన్నారు.

---

గుంటూరు, ఆగస్టు 30: జిల్లా కాంగ్రెసు సంఘానికి రేపల్లె తాలూకా గరికెపూడి, పెనమూడి, తెనాలి తాలూకా కొల్లూరు, మోపర్రు నియోజకవర్గాలనుండి సెప్టెంబరు 5వ తేదీన ఎన్నికలు జరుగగలవని జిల్లా ఎన్నికల నిర్వహణాధికారి ప్రకటిస్తున్నారు.

---










# ప్రకాశం నగర నిర్మాణం

### ప్రజల సొమ్ము వృధా

కర్నూలు, సెప్టెంబరు 2: "కర్నూలులోని 'ప్రకాశం నగర్' సహకార వాడలో నిర్మించిన ఇండ్లు పక్కా ఇండ్లుకావు. మామూలు గృహనిర్మాణ ప్రమాణాల ప్రకారం వాటిని నిర్మించలేదు. ఇసుక తుందులు ఆలోచించకుండా, వివక్షత లేకుండా ఈ యిండ్లపై ప్రజల డబ్బు వృథాచేశారని చెప్పాలి" అని కర్నూలు పబ్లిక్ వర్క్సు శాఖ ప్రత్యేక డివిజన్ (మొదటి) ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు శ్రీ సి. జనార్దనరావు విమర్శించారు. ఈ వాడను నిర్మించి తొమ్మిదినెల లవుతున్నది. అక్కడి ఇండ్లనుగురించి సహకార శాఖమంత్రికి ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు నిన్న సుదీర్ఘమైన నివేదిక పంపిస్తూ యీవిధంగా విమర్శించారు.

తమఇండ్లు చాలా అధ్వాన్నస్థితిలో ఉన్నవని ఆవాడసభ్యులు ఫిర్యాదు చేయగా ఆగస్టు 20వ తేదీన సహకార శాఖ మంత్రితో కూడా ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు అక్కడికివెళ్ళి మంత్రి పర్యవేక్షణలో వాటిని తనిఖీ చేశారు.

తన నివేదికలో ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు శ్రీ జనార్దనరావు ఇంకా యిట్లా తెలియజేశారు.

"ఈఇండ్లు నిర్మించడంలో లోగడ చేసిన తప్పులను సరిదిద్దడానికి ఇటీవల కొంత కృషి జరిగినట్లు కనిపించినా చెప్పుకోతగ్గంతగా వాటిని సరిచేయడం జరగలేదు. వాస్తవానికి అజమాయిషీ అనేదేమీ లేకుండా, ఇంజనీరింగ్‌కు సంబంధించిన ప్రాథమిక సూత్రాలనైనా తెలుసుకోకుండా - వీటన్నింటికంటే సహకార భావమనేదేమీ లేకుండా ఈయిండ్లను నిర్మించారు.

### వంగిపోయిన దూలాలు

దూలాలు అనేకచోట్ల వంగిపోయినవి. మొత్తం ఇండ్ల కప్పు అంతా నామరూపాలు లేకుండా త్వరలో పడిపోయి ఇండ్లలోనివారికి హాని కలిగించవచ్చు. ఇండ్లముందుభాగంలోని వరండాలలో వేసిన కొయ్య దూలాలు వంగిపోయినవి. వాటిని తీసివేసి కొత్తదూలాలనైనా వేయించాలి. లేదా అవి పడిపోకుండా పోటీలనైనా వెంటనే ఏర్పాటు చేయించాలి. దాదాపు కొత్త ఇండ్లన్నింటిపై కప్పులో వాన కురిసేట్లు కనిపిస్తున్నది. ఇండ్లపైభాగాలలో డాబా వెయ్యడానికి చాలా చవకబారు సామగ్రి వాడారు. పనితనం కూడా చాలా అసంతృప్తికరంగా వున్నది.

### అవకతవక రోడ్లు

"ఈ వాడలో కర్నూలు గృహనిర్మాణ సహకారసంఘం వేయించిన రోడ్లు తీరుగాని, వాలుగాని ఏమీ బాగా లేదు వాననీళ్లు గుంటలలోచేరి మురగకుండా ఉండడానికి వీలుగా అవతలికి పోయే యేర్పాట్లు చేయించాలి. గాలివాననీళ్లు ఆ ప్రాంతంనుంచి సులభంగా అవతలికి పోయినవి. కనుక సరైన పద్ధతిలో మురుగుకాలువలను ఏర్పాటుచేయడం సులభ సాధ్యమే. ఈ విషయాన్ని ఉన్నతాధికారులు పరిశీలించి తమ ఖర్చులతో లోగడ జరిగిన లోపాలను సరిచేయవలసిందిగా ఆ సహకారసంఘాన్ని ఆదేశించడ మవసరం."

## మేకకు బదులు కొడుకు బలి

భవానిపాట్నా (ఒరిస్సా), సెప్టెంబరు 2: మేకకు బదులు కన్నకొడుకునే గృహదేవతకు బలిఇచ్చిన ఘోరసంఘటన ఒకటి తెలియవచ్చింది. ఇది జర్లికోట గ్రామంలో జరిగింది.

మొదట ఒక మేకను బలిఇద్దామని అనుకుని ఏర్పాట్లు చేసుకున్నాడు. మధ్యలో డబ్బు అవసరమైంది. యెక్కడా దొరకలేదు, వెంటనే ఆమేకను అమ్మేశాడు. బలి ఇవ్వనందున అమ్మవారు ఆగ్రహిస్తున్నట్లు భావించాడు. తక్షణం తన తొమ్మిదేండ్ల బాలుని అజేయత ప్రీత్యర్థం బలి యిచ్చాడు.

ఇతడు 10 రోజులక్రితం పారిపోదలిచాడట. పూళ్లోవాళ్లకి అనుమానంవేసి పోలీసులకు కబురుచేశారు. దర్యాప్తు మీదను అసలు విషయం బయటపడింది. అతన్ని పోలీసులు అరెస్టుచేశారు.

## అన్నామలై విశ్వవిద్యాలయం

అన్నామలై నగర్, సెప్టెంబరు 1: రజతోత్సవ సందర్భంలో కేంద్రప్రభుత్వం ఇచ్చిన 8 లక్షల రూ. గ్రాంటును ద్రావిడ భాషల పరిశోధనకుగాను వినియోగించడానికి అన్నామలై విశ్వవిద్యాలయం నిశ్చయించుకుంది. త్వరలోనే వీరు మలయాళం, కన్నడం, తెలుగులలో పరిశోధనలు సాగించేందుకు ఒక్కొక్క ఆచార్యుణ్ణి, ముగ్గురు ముగ్గురు సహాయాధ్యాపకులను నియమించగలరని తెలుస్తున్నది.

## సంస్థానాధీశుల భరణాలు

### తగ్గించ ఢేబర్ కృషి

రాజ్‌కోట్, సెప్టెంబరు 1: మాజీ సంస్థానాధీశుల్ని స్వచ్ఛందంగా తమ భరణాలను తగ్గించాలని కోరేందుకు కాంగ్రెస్ అధ్యక్షుడు ఢేబర్ వారిని కలుసుకోబోతున్నారు.

# హరిజన సంక్షేమ చర్యల పట్ల అసంతృప్తి

## ఎక్కువ శ్రద్ధ వహించాలని ప్రభుత్వానికి హెచ్చరిక

విజయవాడ, సెప్టెంబరు 2: హరిజన కాంగ్రెసు కార్యకర్తలు నిన్న నిక్కడ ప్రత్యేకసభ జరిపి, హరిజన సంక్షేమం విషయంలో ఆంధ్ర ప్రభుత్వం ఇప్పుడు అనుసరిస్తున్న విధానంపట్ల అసంతృప్తి వెలిబుచ్చుతూ ఏకగ్రీవంగా ఒక తీర్మానం చేశారు. అక్టోబరు 2వ తేదీనాటికి, హరిజనుల సమస్యలను, సంతృప్తికరంగా ప్రభుత్వం పరిష్కరించని పక్షంలో తగు చర్యలు జరపడానికి సిద్ధంగాఉండవలసిందని హరిజనులనూ, హరిజన క్రైస్తవులనూ, సానుభూతిపరులనూ కోరారు. సభకు శ్రీ బి. ఎస్. మూర్తి అధ్యక్షత వహించారు.

### అసంతృప్తికి కారణాలు

తమకు అసంతృప్తి కలగడానికిగల కారణాలను ఈ తీర్మానంలో వీరు ఇలా పేర్కొన్నారు: ప్రభుత్వం, హరిజన సంక్షేమశాఖను సాంఘిక సంక్షేమశాఖగా మార్చివేసింది. హరిజన వసతిగృహాలు 20 వరకూ మూసివేయించింది. హరిజన సంక్షేమ కార్యక్రమాలకు నిధి ఏర్పాటు చేయలేదు. హరిజనులకు బంజర్లు ఇవ్వడంపట్ల అశ్రద్ధ. రాష్ట్రప్రభుత్వోద్యోగాలలో హరిజనులకు నిర్ణయించిన కోటా ప్రకారమైనా, విద్యావంతులయిన హరిజనులకు ఉద్యోగాలు ఇవ్వటంలేదు. వ్యవసాయ కూలీలకు కనీస వేతనాలు నిర్ణయించే పథకాన్ని అమలు జరుపలేదు.

### సాంఘిక సంక్షేమ శాఖ కూడదు

సభాధ్యక్షులు బి. ఎస్. మూర్తిగారు మాట్లాడుతూ, హరిజన సంక్షేమ శాఖ ఏళ్లతరబడి ఆందోళన చేసిన మీదట ఏర్పాటు అయినదనీ, అటువంటి దాన్ని, ఆంధ్ర ప్రభుత్వం హరిజన ప్రతినిధులతో సంప్రదించకుండా, సాంఘిక సంక్షేమ శాఖగా మార్చివేసిందనీ అన్నారు. ఈచర్య తీసుకోవడంలో ప్రభుత్వానికిగల అధికారాన్ని ఆయన సవాలు చేశారు.

రాష్ట్రంలో హరిజన సంక్షేమానికి జరుగవలసిన కార్యక్రమాలను అమలు జరిపించడానికి కృషిచేసే నిమిత్తం బి. ఎస్. మూర్తిగారు అధ్యక్షుడుగా 9 మంది సభ్యులతో ఒక సంఘాన్ని నెలకొల్పారు. హరిజన క్రైస్తవుల ఇబ్బందులను రాష్ట్ర ప్రభుత్వం దృష్టికి తెచ్చే నిమిత్తం మరొక సంఘం నెలకొల్పారు.

గోవా ఉద్యమంలో ప్రాణార్పణ చేసిన వీరులకు జోహార్లర్పిస్తూ సభలో ఒక తీర్మానం చేశారు. ఆగస్టు 24 సంభవించిన కృష్ణానది లాంచి ప్రమాదంలో ప్రాణాలు కోల్పోయిన వారి కుటుంబాలకు సానుభూతి తెలుపుతూ మరొక తీర్మానంచేశారు.

## పిడుగురాళ్లలో ఆస్పత్రి అవసరం

### గ్రామ కాంగ్రెసు విజ్ఞప్తి

పిడుగురాళ్ళ, ఆగస్టు 31: ఆంధ్ర రాష్ట్ర సహకారమంత్రి దామోదరం సంజీవయ్యగారు నిన్న నిక్కడికి వచ్చి సుగాలీ విద్యార్థి వసతి గృహాన్ని మాజీ సైనికుల సహకార కేంద్రాన్ని సందర్శించారు.

తరువాత శాసనసభ్యుడు మండవ బాపయ్యచౌదరిగారి అధ్యక్షతన జరిగిన సభలో గ్రామ కాంగ్రెసు అధ్యక్షుడు కొత్త కాశీ విశ్వనాథంగారు మంత్రికి వినతిపత్రం సమర్పిస్తూ, పిడుగురాళ్లలో ఆస్పత్రి నెలకొల్పడం అవసరమని విన్నవించారు. బత్తుల వేమారెడ్డి, సహకార సంఘాల డిప్యూటీ రిజిస్ట్రారు కె. నారాయణాచారి, పల్నాడుతాలూకా తహశీల్దారు కె. వి. సుబ్బారావు ప్రభృతులు సభకు హాజరయ్యారు.

## నాయిబ్రాహ్మణుల విజ్ఞప్తి

గుంటూరు, సెప్టెంబరు 1: ఆంధ్ర రాష్ట్ర నాయీ బ్రాహ్మణ సంఘం తరఫున, వీరవల్లి కోటలింగము, మాచాటి శ్రీరాములుగారలు నిన్న ఇక్కడ రాష్ట్రప్రభుత్వ సంక్షేమశాఖ మంత్రి లచ్చన్నగారిని దర్శించి, ఒక వినతిపత్రం సమర్పించారు. అందులో మంగలి, పదముతోపాటు, నాయీ బ్రాహ్మణ పదము గూడా వెనుకబడిన జాతుల జాబితాలో చేర్చాలని, తమజాతీయులకు కనీసం ఎస్. ఎస్. ఎల్. సి. వరకైనా ఉచితంగా విద్య బోధించే ఏర్పాటు చేయాలని, వైద్య కళాశాలల్లోనూ సంగీత కళాశాలలోనూ తమజాతి విద్యార్థులకు ప్రత్యేక సౌకర్యం కల్పించాలని, సహకార పద్ధతిన క్షౌరశాలలు నడుపుటకు ప్రభుత్వం పరపతి సౌకర్యం కల్పించాలని, నౌకరీ యినాములకు పట్టాలు యిప్పించాలని, జేబ్లపైనా, రేజర్లపైనా పన్ను విధించి, బీద మురకులకు సహాయం చేయవలెనని కోరారు.

# నంద్యాల - మైదుకూరు రైలుమార్గం

### కోవెలకుంట్ల పంచాయతీ విజ్ఞప్తి

కోవెలకుంట్ల, ఆగస్టు 31: నంద్యాల నుండి, కోవెలకుంట్ల, జమ్మలమడుగు, ప్రొద్దుటూరుల మీదుగా, మైదుకూరుకు కలిపే రైలుమార్గం వేయించవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతూ, ఈ గ్రామ పంచాయతీబోర్డు 27వ తేదీన తీర్మానించారు. ఆ తీర్మానంలో యిలా ఉన్నది.

"నంద్యాల నుంచి పాకాలకు అళ్లగడ్డ మైదుకూరుల మీదుగా ఒక కొత్త రైలుమార్గాన్ని వేయవలసిందిగా ఆంధ్ర ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వానికి సిఫార్సు చేసింది. ఈ మార్గం ఎక్కువ మంది ప్రజలకు ఉపయుక్తం గాకపోగా రైల్వేశాఖవారికి గూడా లాభదాయకంగాదు. నంద్యాలనుండి కోవెలకుంట్ల జమ్మలమడుగు, ప్రొద్దుటూరులమీదుగా మైదుకూరుకు రైలుమార్గం వేసినట్లయితే వ్యాపారకేంద్రాలు బహుజనసమ్మర్దమై గ్రామసీమలకు ఉపయోగపడటమేగాక రైల్వేశాఖకు లాభదాయకంగా గూడా ఉంటుంది. ఈ మార్గమును యిదివరలో 1905 సం॥రంలో రైల్వేశాఖ సర్వేచేసి ఉన్నదిగూడా. కనుక నంద్యాలనుండి పాకాలా వేయదలచిన మార్గాన్ని ఈ విధంగా మార్చాలని కోరుతున్నాము.

## ఆంధ్రలో ఎన్నికల పిర్యాదులు

కర్నూలు, సెప్టెంబరు 1: ఆంధ్ర శాసన సభకు లోగడ జరిగిన ఎన్నికలలో గెలుపొందిన 7 గురు సభ్యుల యెన్నిక చెల్లదనీ, తామే సక్రమంగా యెన్నికైనట్లు ప్రకటించాలనీ ఏడుగురు పెట్టుకొన్న దరఖాస్తులను ఏలూరులోని యెన్నికల ట్రిబ్యునల్ అసాధారణ గెజెట్‌లో ప్రకటించారు

దరఖాస్తుల వివరాలివి: (1) సి. హెచ్. పరసురామనాయుడు (కృషికర్) గారు శ్రీ వి. వి. చూడామణిదేవ్ (స్వ-పార్వతీపురం) యెన్నిక సక్రమం గాదని దరఖాస్తు చేశారు. (2) శ్రీ కె. బాపన్న దొర (ప్రజా) భద్రాచలం నియోజక వర్గంలో శ్రీ ఎస్. సీతారామయ్య, మరొకరి యెన్నిక సక్రమం కాదన్నారు. (3) శ్రీ టి. లక్ష్మినాయుడు (పి. ఎస్. పి.) బొబ్బిలి నియోజకవర్గంలో శ్రీ కె. సీతారామస్వామి (కాం) మరి నలుగురిమీద ఎన్నికల ఫిర్యాదుచేశారు. (4) అత్తిలి నియోజకవర్గం నుంచి శ్రీమతి సి. అమ్మన్నరాజా (కాం) యెన్నిక అక్రమమని శ్రీ దాట్ల సూర్యనారాయణరాజు దరఖాస్తులో వాదించారు. (5) గుంటూరు (మొదటి) నియోజక వర్గంలో శ్రీ తెల్లాకుల జాలయ్య (కాం) మరి ముగ్గురిమీద శ్రీ ఎన్. వి. ఎల్. నరసింహారావు (పి. ఎస్. పి.) ఫిర్యాదు చేశారు. (6) ప్రత్తిపాడు నియోజకవర్గంలో శ్రీ వై. నరసారావు (వోటరు) శ్రీ పర్వతి గుర్రాజు (కాం) మరి ముగ్గురిమీద ఫిర్యాదు తెచ్చారు. (7) పాలూరు రిజర్వుడ్ స్థానం గురించి శ్రీ గాడిపల్లి శ్రీ బోయిన రాజయ్య (కాం) మరి 9 మంది మీద శ్రీ గాడిపల్లి వీరయ్య (స్వ) ఫిర్యాదు తెచ్చారు.

ఎన్నికలలో గెలుపొందిన అభ్యర్థులు అనేక రకాలుగా ఎన్నికల నిబంధనల నుల్లంఘించారని దరఖాస్తుదారుల వాదన.

ఎన్నికలలో పోటీ చేయవలసిన ప్రజా ప్రాతినిధ్యం చట్టం ప్రకారం ఉండవలసిన వయస్సుకంటే తక్కువ వయస్సుగలఅభ్యర్థులు ఎన్నికలలో పోటీ చేశారనీ, ఎన్నికలలో అక్రమ పద్ధతుల నవలంబించారనీ ఇంకా అనేక ఆరోపణలను ఈ దరఖాస్తులలో చేశారు. పాలూరు ప్రత్యేకస్థానానికి తానొక్కడే యోగ్యతగల అభ్యర్థినని జి. వీరయ్యగారి వాదన.

## కుక్క తెచ్చినతగాదా

మొరాదాబాద్, సెప్టెంబరు 2: ఇక్కడ జరిగిన ఒక పెద్ద కొట్లాటకి ఒక చిన్న కుక్క తప్ప వేరె ఎవరూ కారణంకాదు. దెబ్బలాటలో 20 మంది గాయపడ్డారు. లాఠీలు, రాళ్ళు, స్వేచ్ఛగా విహరించాయి.

ఒకాయన దారినపోతుండగా ఎవరిదో కుక్క ఆయనమీదపడి కరచబోయింది. వెంటనే దానిని పట్టుకుని చితకగొట్టాడు. అది మొయ్యో మనడం విని దాని యజమాని బయటికివచ్చి అదాకే పోతున్న పెద్ద మనిషిని పట్టుకుని ఛడామడా తిట్టాడు. చినికి చినికి గాలివాన అయింది. అటు కొందరు ఇటు కొందరు పోగై బాగా కొట్టుకుని పోలీసులు రాగానే వెళ్లిపోయారు. కొందరిని అరెస్టు చేశారు.

# 2 వేల ఎకరాల భూదానం

### వేణుగోపాలరెడ్డి గారి వితరణ

నెల్లూరు, సెప్టెంబరు 1: ఈ జిల్లా కాంగ్రెసువ్యులు ఈశ్వరవాక వేణుగోపాల రెడ్డిగారు సూళ్లూరుపేట తాలూకా కుమ్మరిపాలెం, వేనాడు మొదలైన కొన్ని గ్రామాలలో తమకున్న 2 వేల యెకరాల భూమినిభూదానయజ్ఞానికి సమర్పించారు. తమ కుటుంబీకులు 15 మందికి అవసరమైనభూమి 600 యెకరాలు మాత్రమే వీరు ఉంచుకొన్నారు.

వేణుగోపాలరెడ్డిగారు, కొన్ని సంవత్సరాలు చెంగల్పట్టు జిల్లాకాంగ్రెసు అధ్యక్షులుగా పనిచేశారు. కాంగ్రెసు ఉద్యమంలో అనేకసార్లు జైలుకు వెళ్ళారు.

## నందిగామలో కాంగ్రెసు ఎన్నికలు

నందిగామ, ఆగస్టు 30: పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెసు స్థానానికి ఆగస్టు 24న జరిగిన ఎన్నికలో సయ్యద్ అబ్దుల్ ఖాదర్ గారు (493 ఓట్లు) ఎన్నికయ్యారు. ఈయనతో పోటీ చేసిన షేక్ వలీగారికి 87 ఓట్లు వచ్చాయి.

తాలూకా కాంగ్రెసుసంఘంలో రెండుస్థానాలకు పోటీ జరిగింది. ఒక స్థానానికి అబ్దుల్ ఖాదరుగారు (496 ఓట్లు) ఎన్నికయ్యారు-ఈయనతో పోటీ చేసిన షేక్ ఖాసింగారికి 36 ఓటు వచ్చాయి. మరో స్థానానికి వెంట్రప్రగడ లక్ష్మినారాయణగారు (475) ఎన్నికయ్యారు వీరితో పోటీచేసిన పులిపాటి కృష్ణమూర్తిగారికి 51 ఓట్లు వచ్చాయి. స్వ. వి.

# పశ్చిమగోదావరిలో పంటల నష్టం

## సహాయం అవసరమని విజ్ఞప్తి

భీమవరం, సెప్టెంబరు 2: "కుమూరు 2 వేల ఎకరాల భూమి నీటిలో మునిగిపోయింది. మొగల్లులో సుమారు 50 ఇండ్లు నేలకూలినవి. నీరు ఇప్పటిలో ఆరిపోయే అవకాశం లేదు కనుక ఈ భూమిలోనిపంట చేతికివచ్చే అవకాశమేమీలేదు" అని శాసనసభ్యుడు గాదిరాజు జగన్నాథరాజుగారు అన్నారు.

భీమవరంతాలూకాలో వరద ప్రమాదానికి గురిఅయిన మొగల్లు, కోరుకల్లు, గరగపర్రు మొదలయిన గ్రామాలలో పరిస్థితిపై ఆయన ఇట్లా చెప్పారు: "కాలవకు గండి యేమీ పడలేదుగాని తూము ఒకటి పూర్తిగా చెడిపోయినందు వననే యీప్రమాదం జరిగింది. యింతలేదన్నా వెయ్యియకరాలలో పంట దెబ్బతినిపోతుంది. చెడిపోయిన తూమును తిరిగి కట్టించేలోగా సిమెంట్ గొట్టాలతో తాత్కాలిక ఏర్పాటుచేయడం చాలా అవసరం."

### తాడేపల్లిగూడెం తాలూకాలో నష్టం

తాడేపల్లిగూడెం, సెప్టెంబరు 1: "ఎనమదుర్రు మురుగు కాలవ గండి పడటం [illegible] వల్లూరు, రావిపాడు, చిలకపాడు [illegible] గ్రామాల [illegible] పంటభూమి మునిగిపోయింది. వరి చేల మీద ఒక అడుగు నీళ్ళు నిలిచి వున్నవి. [illegible] దని రైతులు భయపడుతున్నారు అని తాడేపల్లిగూడెం తాలూకా కాంగ్రెసు అధ్యక్షుడు గుమ్మలపల్లి సత్యనారాయణమూర్తి గారొక ప్రకటన చేస్తున్నారు.

ఆప్రకటనలో ఇట్లా ఉన్నది: "భూములలో 24 గం లలో నీళ్ళు తగ్గిపోయి మొక్కల తలలు కనిపించకపోతే పంట పూర్తిగా పోతుందని రైతులు ఆందోళన పడుతున్నారు. ఒక వైపున ఎనమదుర్రు కాలవ మరొక వైపున వెంకయ్య కాలవ ప్రవహిస్తున్నవి. ఉంకాలవలలో నీళ్లు తగ్గించి గండ్లు కొట్టించి నీళ్లను అందులోకి మళ్లించాలి. కొన్ని గ్రామాలలోని హరిజనుల ఇండ్లు వెనకవడిన తరగతుల యిండ్లు పూర్తిగా జలమయమైనవి. నందమూరులో 100 ఇండ్లు, మారంపల్లిలో 200 ఇండ్లు పడిపోయినవి. ఈప్రమాదంలో ఇండ్లు పడిపోయినవారు తిరిగి ఇండ్లు కట్టుకొనడానికి ప్రభుత్వం వెంటనే తగు సహాయం [illegible] 300 [illegible] ప్రారంభం జరుపుట మైనది."

## గంటల పంచాంగం

శ్రీమన్మథ సం॥ అధిక భాద్ర॥ బ॥ ద్వితీయ 1955 - సం॥ సెప్టెంబరు 4 ఆదివారం అ॥ ద్వితీయ 11-35 ఉ॥ భా 20-15 వర్జ్యం 6-11 ల 7-4 వ.

బ॥ తృతీయ సెప్టెంబరు 5 సోమవారం పా॥ తృతీయ 10-6 రేవ 19-25 వర్జ్యం 7-50 ల 9-23 వ.

ఆంధ్రపత్రిక

[illegible]
(మహాభారతము)

శ్రీమన్మథసం॥ అధికభాద్ర॥ బ॥ ద్వితీయ
ఆదివారం

## పాక్-పోర్చుగల్ సంబంధాలు

గోవా సమస్యపై అభిప్రాయం వెల్లడించకపోవడమే రాజనీతిజ్ఞత, వివేకము అని పాకిస్తాన్ క్రొత్త ప్రధానమంత్రి భావించడంలో విపరీతమేమీ లేదు. గోవాకు ఆహార ధాన్యాన్ని సరఫరా చేయడంలోనూ, కరాచీ-గోవాల మధ్య విమానయానాన్ని అనుమతించడంలోనూ పాకిస్తాన్ ప్రభుత్వం గోవా సమస్యపట్ల ఏ విధానాన్ని అవలంబిస్తున్నదో ఇదివరకే వెల్లడి అయినది. పాకిస్తాను ప్రధానమంత్రి క్రొత్తగా తమ ప్రభుత్వ విధానాన్ని, వైఖరిని వివరింపవలసిన అవసరం లేదు.

బాండుంగ్ మహాసభ తీర్మానాలను ఆమోదించిన ప్రతి దేశమూ ఆసియాలో వలస విధానానికి స్వస్తి చెప్పడానికి శాయశక్తులా కృషి చేయవలసి వున్నది. పాకిస్తాన్ ప్రవర్తన బాండుంగ్ మహాసభ తీర్మానాలకు అనుగుణంగా వుందని ఎవ్వరూ సమర్థించలేరు. బాండుంగ్ తీర్మానాలు, సిఫార్సులు మాత్రమే గాని ఆదేశాలు కాదు. అయినా మొరాకోలో ఫ్రెంచి సామ్రాజ్య దౌర్జన్యాలను ఖండిస్తూ గోవాలో పోర్చుగీసుల కిరాతకచర్యలను గమనింపకపోవడం ఒక్క పాకిస్తాన్‌కే తగివుంది. ఒక్క పాకిస్తాన్ తప్ప బాండుంగ్ సమావేశంలో పాల్గొన్న అన్ని దేశాలు పోర్చుగల్ గోవా విధానాన్ని తీవ్రంగా ఖండించినవి. గోవా నుంచి పోర్చుగల్ నిష్క్రమింపక తప్పదని స్పష్టం చేసినవి.

పాకిస్తాన్ విధానానికి కారణం ఏమో తెలుసుకోవడం కష్టంకాదు. భారత ప్రభుత్వం వీలైనన్ని క్లిష్టసమస్యలలో చిక్కుకు పోవడం పాకిస్తాన్‌కు సంతోషకరమైన విషయం. పాకిస్తాన్‌కు సాధ్యమయ్యే పక్షంలో గోవా వ్యవహారాన్ని మరింత క్లిష్టంచేయడానికి ప్రయత్నింపవచ్చును. గోవా రేవును హైదరాబాద్‌కు కవులుకు ఇవ్వడానికి పోర్చుగల్ అంగీకరించింది. అదేవిధంగా ఇప్పుడు పోర్చుగల్ పాకిస్తాన్‌కు ఈ రేవును ఇచ్చి వేయవచ్చును. పశ్చిమ పాకిస్తాన్‌కు కరాచీతప్ప మరొక రేవు లేదు కనుక ఈ రేవును సంపాదించాలనే అభిలాష పాకిస్తాన్ ప్రభుత్వానికి కలిగివుండవచ్చును. కాని ఈ రేవు పట్నం పశ్చిమ పాకిస్తాన్ వ్యాపారానికి ఎంతమాత్రమూ ఉపయోగపడదు. మార్మగోవాపై గల "అధికారాన్ని" పోర్చుగల్ ప్రభుత్వం తప్ప మరొకరికి దఖలు పరచడానికి వీలు లేదు.

ఈ విషయం పాకిస్తాన్ ప్రధాన మంత్రికి తెలియక పోలేదు. గోవా సమస్య పరిష్కారం కాకుండా వుండడమే పాకిస్తాన్‌కు కావలసింది. యథాస్థితికి భంగం కలుగకుండా వుండేందుకు పాకిస్తాన్ పోర్చుగల్‌కు ఎంత సహాయమైనా చేస్తుంది.

భారత ప్రభుత్వం పాకిస్తాన్‌కు ఇదివరకే అభ్యంతరాలను తెలిపినట్లు, అందువల్ల ఏమి ప్రయోజనం కలుగనట్లు ప్రధాన మంత్రి పార్లమెంటులో ప్రకటించారు. ఈ ప్రకటన జరిగిన అనంతరం కూడా పాకిస్తాన్ ప్రధాన మంత్రి పాక్-పోర్చుగల్ సంబంధాల విషయమై ఖచ్చితమైన ప్రకటన చేయలేదు అంటే పాకిస్తాన్ ఇకముందు కూడా ఇప్పటి విధానాన్నే అనుసరిస్తుందని స్పష్టమైనది. "కాశ్మీర్‌పై ఎవరు దురాక్రమణ జరిపినా అట్టి దురాక్రమణ భారత దేశంపై జరిగినట్లే" భావింపవలసి వుంటుందని ప్రధాన మంత్రి ఇదివరలో పాకిస్తాన్‌ను ఉద్దేశించి ఒక హెచ్చరిక చేశారు. గోవా విషయంలోనూ అదే విధమైన హెచ్చరిక చేయవలసిన సమయం వచ్చింది. పోర్చుగల్‌కు భారతదేశంలోని స్థావరాలను సంరక్షించు కొనుటలో ఎవరు ఏ విధమైన సహాయం చేసినా అది భారతదేశంపై జరిగిన శత్రు చర్యగానే పరిగణించడమౌతుందని భారత ప్రభుత్వం స్పష్టం చేసేవరకూ గోవా సమస్యా పరిష్కారానికి అనుకూలమైన పరిస్థితులు ఏర్పడవు. భారత ప్రభుత్వం ఈ విధమైన హెచ్చరికను చేయడం గురించి త్వరలో నిర్ణయానికి రావలసి యున్నది.

## గోవాకు పాక్ బియ్యం

### 72 వేల బస్తాల సప్లయి

కార్వార్, సెప్టెంబర్ 3: గోవా పోర్చుగీస్ అధికారులు 72 వేల బస్తాల బియ్యాన్ని పాకిస్తాన్‌దగ్గర కొనటానికి ఒప్పందం వ్రాసుకున్నారని గోవా నేషనల్ కాంగ్రెసు వర్గాలద్వారా తెలుస్తున్నది.

గోవానుంచి వస్తున్న భారతీయ వర్తకులుకూడా ఈ విషయాన్ని ధృవపరుస్తున్నారు. ఈ బియ్యంలో మొదటి కిస్తా 10 వేల బస్తాలు ఇటీవలే పోర్చుగీసునౌక 'లోబో'లో గోవా చేరినవని వారు తెలియజేస్తున్నారు.

కిందటివారం లిస్బన్‌నుంచి వచ్చిన 'ఇండియా' అనే పోర్చుగీసు నౌకకూడా అక్కడినుంచి ఆహారపదార్థాలు తెచ్చింది. ఆ నౌక గోవానుంచి సెలవుమీద కొందరు పోర్చుగీస్ సైనికులను తీసుకువెళ్లిందనీ, వాళ్ళ బదులు కొత్త వాళ్లు వస్తారనీ కూడా తెలుస్తున్నది.

## భూమికి అణువు ఆయుధ ప్రమాదం

### శాస్త్రజ్ఞులు విచారించాలని సూచన

బ్రిస్టల్, సెప్టెంబర్ 1: "హైడ్రోజన్ బాంబుకన్నా హెచ్చుగా ఉండే లిథియం అణుబాంబులవల్ల ప్రారంభమయే అణు విచ్ఛిన్న పరంపర ప్రక్రియవల్ల భూమి పేలిపోయే ప్రమాదం ఉందేమో శాస్త్రజ్ఞులు పరిశీలించటం అవసరం" అని బ్రిటిష్ శాస్త్రాభివృద్ధి పరిషత్ అధ్యక్షుడు సర్ రాబర్ట్ రాబిన్సన్ నిన్న ఇక్కడ పరిషత్ సమావేశంలో హెచ్చరించారు.

నేటి సమావేశంలో మాత్రం ఇద్దరు శాస్త్రజ్ఞులు అట్లా భూమి పేలిపోయే అవకాశం లేదన్నారు. ఈ పరిషత్తులో గణిత, పదార్థ విజ్ఞాన శాస్త్రాల విభాగాధ్యక్షుడు ప్రొఫెసర్ నెవిల్ మాట్, ప్రస్తుతం తెలిసిన ప్రకృతి సూత్రాల ప్రకారం అణు విస్ఫోట బాంబులవల్ల భూమి పేలిపోయే ప్రమాదం కానీ, గాలి, సముద్రమూ మండిపోయే ప్రమాదం కానీ లేవని అన్నారు.

బ్రిస్టల్ విశ్వ విద్యాలయపు పదార్థ విజ్ఞాన శాస్త్ర విభాగాధికారి ప్రొఫెసర్ కూడా ఇదే అన్నారు.

## కాశ్మీర్ సమస్యపై అఖిలపక్ష సమావేశానికి కృషి

### జాతీయ విధానాన్ని రూపొందించడానికి పాక్ ప్రధాని తాపత్రయం

కరాచీ, సెప్టెంబరు 2: ఆజాద్ కాశ్మీర్ నాయకులతో సహా అన్ని పక్షాల నాయకులను పిలిచి, సమాలోచనలు జరిపి కాశ్మీర్ విషయంలో జాతీయమైన విధానాన్ని ఒకదాన్ని తాను తయారు చేయదలచుకున్నట్లు పాక్ ప్రధాని చౌదరీ మహమ్మదలీ నేడు పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ అన్నారు.

పాకిస్తాన్ ప్రధాని కాశ్మీర్ సమస్యను నైతిక సమస్యఅని వర్ణించారు. భారతదేశంతో తమకు వున్న అన్ని తగాదాలలోను ఇది చాలా పెద్ద తగాదా అని, ముఖ్యమైన తగాదా అని, ఈ తగాదాలను అన్నింటిని శాంతియుతంగా, గౌరవప్రదంగా పరిష్కరించుకోవాలనే తాము చూస్తున్నామని గూడా ఆయన ఈ సందర్భంలో వివరించారు.

కాశ్మీర్ భవిష్యత్తును ప్రజల ఇష్టానుసారం తేలుస్తానని పాకిస్తాన్‌కు మాట ఇచ్చిందట. ఆ మాటను సమితి, భారత దేశాలు గూడా ఆమోదించాయటగాని, ఈ ఆమోదించి 7 సంవత్సరాలయినా ఈ జనవాక్యాన్ని జరపకపోవడం ఈయనకు కష్టంగా వున్నదట. అందువల్ల ఇప్పుడు అన్ని పార్టీల నాయకులను సమావేశపరిచి, ఈ సమస్యను పరిష్కరించేందుకు అయిన మార్గాలను గూర్చి ఆలోచించ దలచుకున్నట్లు నేడు వెల్లడిచేశారు.

### ఇస్లాం ప్రజాస్వామ్యం

దేశంలో సుస్థిరమైనట్టి అభ్యుదయ ప్రజాస్వామ్యాన్ని ఇస్లాం ఆదర్శాలకు అనుగుణంగా స్థాపించడమూ, అంతర్జాతీయంగా తన మిత్ర రాజ్యాలలో కలిసి రక్షణమండలాలు నిర్మిస్తూ, శాంతికోసం కృషి చెయ్యడమూ పాకిస్తాన్ విధానాలైనట్లు ప్రధానమంత్రి చెప్పారు.

### అల్ప సంఖ్యాకులను సరిగా చూడాలని వాంఛ

పాకిస్తాన్‌లో అందరికి నచ్చేవిధంగా ఇస్లాం ధర్మాలతో ఒక రాజ్యాంగాన్ని రచించడం, అనంతరం న్యాయంగా ఎన్నికలు జరపడం, అల్ప సంఖ్యాకులను సరిగా చూడటం, ప్రజల జీవన ప్రమాణాలు పెరిగేట్లు చూడ్డం, శరణార్థులకు పునరావాస సౌకర్యాలు కల్పించడం ఇవి అన్నీ తాను, సాధించదలచుకున్న అంతరంగిక లక్ష్యాలుగా ఆయన వివరించారు. రాజ్యాంగాన్ని రెండు నెలల్లో తయారు చేయిస్తామనీ, అవామీలీగ్ గూడా వచ్చి తనతో కలిస్తే ఈ పని ఇంకా తొందరగా జరిగిపోతుందని తాను భావిస్తున్నట్లు ఈయన పేర్కొన్నారు.

వలస విధానాలు మాకు వద్దు. ఇంకా బానిసత్వంలో వున్న ప్రజల స్వాతంత్ర్యంకోసం కృషి చేస్తాం. ముస్లిం ప్రపంచంతో సంబంధాలు పెంచుకుంటాం, అన్ని దేశాలతోను సామరస్యం చేస్తాం. మధ్య ప్రాచ్యము, ఆగ్నేయ ఆసియాలలో శాంతి భద్రతలు కాపాడవలసి వున్నది గనక అందుకు గాను ముందుకు వచ్చే అందరితో కలిసి సైనిక మండలాల్లో చేరుతాము. బ్రిటన్-టర్కీ-ఇరాక్‌లు చేసుకున్న సంధిని త్వరలో ఆమోదించేస్తాము. పాకిస్తాన్ ముందు తనను తాను రక్షించుకోవలసి వుంది. ఆత్మరక్షణను స్వయంగా పూనుకునేటందుకు సరిపడే డబ్బు లేదు గనుక అమెరికాతో సైనిక సహాయం సంధిని చేసుకోవడం జరిగింది. మొత్తంమీద నా విదేశీయ విధానాన్నికి, పూర్వపు మహమ్మదాలీ విధానానికి ఆట్టే తేడా ఏమీలేదు.

### మంత్రిమండలి విస్తరణ

ఇదంతా ఆయన వ్రాసుకు వచ్చి చదివి విలేఖరులకు వినిపించారు. అనంతరం విలేఖరుల ప్రశ్నలకు సమాధానం ఇచ్చారు. ఆ సమాధానాలు సారాంశం ఇట్లావుంది: నా మంత్రిమండలిని త్వరలోనే విస్తరిస్తాను, మొత్తం 14 మంది దాకా మంత్రులుండవచ్చు, ఆ మార్పులు జరిగిన అనంతరం నేను ఒక రక్షణ శాఖను మాత్రమే చేతుల్లో వుంచుకుంటాను. (ప్రస్తుతం ఈయన ఈ రక్షణ శాఖతో పాటు విదేశాంగ వ్యవహారాలు, ఆర్థిక శాఖ గూడా చూస్తున్నారు) పోతే అమెరికావారు చేస్తున్న సైనిక సహాయం విషయమై నేను బహిరంగంగా మాట్లాడం తగదు జనరల్ ఆయూబ్‌ఖాన్ మాట్లాడే వున్నారు. ఆఫ్ఘనిస్తాన్‌లో వుండుకున్న కెండా తగాదా విషయమై ఇంకా మధ్యవర్తిత్వం నడుస్తున్నది. అది సర్వంగా తేలుతుందనే నేను ఆశిస్తున్నాను.

## సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి

### శ్రీ సుధీరంజన్‌దాసు తాత్కాలిక నియామకం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 2. సుప్రీం కోర్టు ప్రధానన్యాయమూర్తి శ్రీ బిజన్ కుమార్ ముఖర్జీ రెండు నెలలు సెలవు పెట్టి పోతున్నందువల్ల ఆ స్థానానికి జస్టిస్ సుధీరంజన్ దాస్‌ను నియమించారు. ఈయన సెప్టెంబరు 5 నుంచి అక్టోబరు 31 దాకా ఈ పదవిలో వుంటారు

ఈ సెప్టెంబరు 5 మొదలు అక్టోబరు 31 దాకా శ్రీ నాగ్‌పూర్ చంద్రశేఖరయ్య సుప్రీంకోర్టు న్యాయమూర్తిగా పనిచేస్తారు.

## కంపెనీల బిల్లు చర్చ

### వాటాదార్లకు నష్టం రాని పద్ధతి

న్యూఢిల్లీ, సెప్టెంబరు 2: కంపెనీల డైరెక్టర్ల ఎన్నిక ఐచ్ఛికమైన పద్ధతిని గాక, నిష్పత్తిదామాషాను జరగాలని కాంగ్రెసు సభ్యుడు శ్రీ ఎస్. ఓ. సాత్వానీ కంపెనీలబిల్లుకు తెచ్చిన సవరణను లోక్‌సభలో 107-162 ఓట్లతో ఓడించారు.

శ్రీ సాత్వానీ తన సవరణను ఉపసంహరించుకోవచ్చునని అనుకున్నారు గాని, ప్రతిపక్షం అందుకు అంగీకరించకపోవడంవల్ల ఈఓటింగు జరిగింది. తక్కిన సవరణలలో ఆర్థికమంత్రి అంగీకరించిన సవరణలనుతప్ప తక్కిన అన్ని సవరణలను లోక్‌సభ తిరస్కరించింది 273 వ అంకానికి వచ్చిన సవరణను మాత్రం ఓటుకూ కాకుండా వుంచారు. మొత్తం నేడు 283 దాకా ఉన్న అంకాలు ఆమోదింపబడినాయి.

డైరెక్టర్ల ఎన్నికల విషయమై నడిచిన తగాదాలో ఆర్థికమంత్రి, ఉపాధ్యక్షుడు శ్రీ అనంతశయనం అయ్యంగారు చేసిన సూచనను ఆమోదించారు. దీన్ని బట్టి అల్పసంఖ్య వాటాదార్లకు నష్టం జరిగేట్లు కన్పిస్తే, కంపెనీవారు ప్రభుత్వం నియమించే డైరెక్టర్లకు బదులుగా ఈనిష్పత్తి పద్ధతి ఎన్నికను ఆమోదించవలసి వుంటుంది.

### అనుభవాలను బట్టి అభిప్రాయాలు

ఆర్థిక మంత్రి శ్రీ దేశ్‌ముఖ్ నేడు చర్చకు 70 నిమిషాలు సమాధానం ఇచ్చారు. తన కు ఇతరులకు ఈ బిల్లు విషయంలో కలిగిన భేదాభిప్రాయాలు ఈకంపెనీలపై వారికివున్న అనుభవాలను పురస్కరించుకొని ఏర్పడ్డవని, ఇంతవరకు ఈకంపెనీల పరిపాలన సవ్యంగా సాగకపోవడం వల్ల, వీటికి సంబంధించిన సమాచారం ప్రభుత్వానికి అందకపోవడం వల్ల ఇలాటి చిక్కులు ఏర్పడుతూ వుండటం సహజమేనని, కాలక్రమాన ఇవి సమసిపోతాయని వివరం చేశారు.

డైరెక్టర్ల నియామకం పద్ధతి, డైరెక్టర్ల పదవీకాలం ఒకమనిషి ఎన్ని కంపెనీలలో డైరెక్టరుగా వుండవచ్చు ఆదిగాగల అంశాలపై చర్చ జరిగింది. ఇందులో శ్రీ ఓ. వీల్. బన్సాల్, శ్రీ సి. సి. షా, పండిత్ భార్గవా ప్రభృతులు పాల్గొన్నారు.

### డైరెక్టర్ల ఎన్నికపద్ధతి

ఒకొక్క మనిషి 20 కంపెనీలలో డైరెక్టరుగా వుండవచ్చునని వుంది. సభ్యులు ఈ పద్ధతిని విమర్శించారు. శ్రీ దేశ్‌ముఖ్ తమ సమాధానంలో దీన్ని సమర్థించి, పరిశీలన సంఘం బాగా ఆలోచించిన మీదటనే ఈ నిర్ణయానికివచ్చారని ఒక ఉపపత్తిని చూపించారు. నిష్పత్తి దామాషా పద్ధతి యెన్నికను తాను యెన్నడు ఆమోదించలేనన్నారు. అంతేగాక రాబడిపన్ను యెగగొట్టినట్లు గనుక ఏ కంపెనీ డైరెక్టరు మీదనన్నా నేరం ఋజువు అయితే, అతన్ని ఆ పదవిపహించడానికి అనర్హుణిగా ప్రకటించాలని కొందరు సభ్యులు చేసిన సూచనను గూడా ఆయన తిరస్కరించారు. "ఈ నేరాలు కోర్టులో విచారణకు రావు. అందువల్ల ఈ పన్ను యెగగొట్టడం కోర్టుకు వచ్చే నేరం కాదు. రాబడిపన్ను ట్రిబ్యునల్ కోర్టులేదు. అందువల్ల మీ సూచనను నేను ఆమోదించను" అన్నారు.

కంపెనీ యజమానులు దుష్టంగా నడిచినా, లేకపోతే అప్రయోజకంగా వ్యవహరించినా ప్రభుత్వం ఏమి చెయ్యాలో ఈ బిల్లులో 408 అంకంలో వుంది. ఆ అంకం చర్చకు వచ్చినప్పుడు శ్రీ అనంతశయనం అయ్యంగారి సూచనను గూర్చి సాకల్యంగా వివరించవచ్చునని సభ వారికి ఆర్థికమంత్రి హామీఇచ్చారు.

## అజంతా ముందు ఉద్యానవనం

ఔరంగాబాద్, సెప్టెంబరు 2 అజంతా గుహాలముందున్న వ్యాఘ్రము (వాగురా) నది గట్లపై అనతికాలంలోనే అందమైన ఉద్యానవనం నిర్మించనున్నారని తెలు

స్తోంది ఇందు నిమిత్తం ప్రభుత్వం అప్పుడే రూ. 10 వేలు మంజూరు చేసి వుంది. వానాకాలం వెళ్ళిపోవటంతోటే పని ప్రారంభమవుతుంది.

ఔరంగాబాదులోనూ, ఎల్లోరా, అజంతా గుహాలకూ ప్రయాణ వసతులను కూడా పెంపొందించటానికి కేంద్ర పురావస్తుశాఖ ఉద్దేశిస్తున్నదట. గుహాలలో ఇంకా అలంకరణలు చేయించాలని కూడా వున్నదట. చూడ వచ్చే వారి ఉపయోగార్థం ఒకటో రకమైన ఉపాహారశాల నిర్మిస్తున్నారు.

## కరెన్సీనోట్లు చేసే యత్నం

### ఒంగోలు తాలూకాలో 7 గురి అరెస్టు

ఒంగోలు, సెప్టెంబరు 2: ఒంగోలు తాలూకా స్టేషన్ సబ్ఇన్‌స్పెక్టరు కె. వి. సుబ్బయ్యగారు,—గాలిసుబ్బయ్య, గుండ్రెడ్డి బ్రహ్మయ్య (యాజలి, బాపట్ల తాలూకా) చిర్రా పూరి హనుమంతరావు (దుగ్గిరాల) కు పాక అంకరాజు (గురువా రెడ్డిపాలెం ఒంగోలు తా॥) చవటపలి ఆదెం (విలూరు నర్సారావుపేట తా॥) బిరకమల్లయ్య (పేటపాలెం) మద్దిరాల యాకోబు (పేరాల) లను అరెస్టుచేసి, ఒంగోలు స్టేషనరీ సబ్ మేజిస్ట్రేటు యెదుట హాజరుపరచగా జామీనుమీద విడుదల చేశారు.

ఈ యేడుగురు మద్దిపాడు సమీపంలోని సీతారాంపురానికి వెళ్లి తాము కరెన్సీనోట్లు తయారుచేసి యిస్తామని గ్రామస్థులను మోసంచేయడానికి ప్రయత్నించారని ఆరోపించబడింది. నోట్లు తయారుచేసేట్లు, రసాయనిక వస్తువులు తదితరసామగ్రిగూడా చూపించారట. గ్రామస్థులు అనుమానించి, పోలీసులకు పట్టించారు క్రి. ప్రొ. కోడ్ 54 సెక్షన్‌క్రింద పోలీసులు వారిని అరెస్టుచేసి వారిదగ్గరవున్న సామగ్రిని స్వాధీన పరచుకున్నారు. దర్యాప్తు సాగుతున్నది.

## కాంగ్రెస్ సంస్థ, ప్రభుత్వాల సహకారం

(1 వ పేజీ తరువాయి)

ముందుకు తేదలిచిన చట్టాలన్నిటినీ ప్రచురించటంతో ప్రదేశ్ కాంగ్రెసుకు వ్యాఖ్యల నిమిత్తం పంపాలి.

### పరిపాలనలో సంస్థజోక్యం కూడదు

మంత్రులు దైనందిన పరిపాలనను స్వేచ్ఛగా జరుపుకోగలిగి వుండాలి, ఉద్యోగుల నియామకాలు, బదిలీలు, ప్రమోషన్లు, పర్మిట్లు మొదలైన వాటిలో జోక్యం పనికిరాదు. న్యాయ పరిపాలనా వ్యవహారాల గురించి అంతరంగికంగా కూడా చర్చించరాదు. ఆ శాఖ స్వాతంత్ర్యాన్ని చెక్కుచెదరకుండా కాపాడాలి. స్థానిక ఉద్యోగులపై ఏవైనా ఫిర్యాదులుంటే వాటిని అధ్యక్షునికో, ముఖ్య మంత్రికో పంపాలేకాని, ఇంకే విధంగానూ విమర్శలుచేయరాదు. కాంగ్రెసు సంఘాలు, కాంగ్రెసువారు ప్రభుత్వాన్ని బహిరంగంగా గానీ, పత్రికల ద్వారా గానీ విమర్శించరాదు. ఏవిధానం విషయంలోనైనా విభేదాలు వచ్చి, అవి స్థానికంగా పరిష్కారం కాకపోతే పార్లమెంటరీ బోర్డుకు తెలియచేసి వారి సహాయం కోరాలి. అంతేగాని ఏ సందర్భంలోనూ ఈ విభేదాలను బహిరంగంగా చర్చించరాదు. కాంగ్రెసుకు బలం చేకూర్చేందుకూ ప్రతిష్ఠను పెంపొందించటానికీ సక్రమమైన పనులన్నీ టినీ మంత్రులుచేయాలి. కాంగ్రెసువారు ప్రభుత్వ విధానాలను బాగా బలపరిచి, అపోహలను తొలగించాలి. ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడు ఏ ఉద్యోగిమీదనైనా తీవ్రమయిన ఫిర్యాదుచేస్తే మంత్రివర్గం పరిశీలించి, ఆ ఉద్యోగిపై తగుచర్యలు తీసుకోవాలి ఒక ఉద్యోగి విషయంలోగానీ, ఇతర వ్యవహారాలలోగానీ ఏ కాంగ్రెసువాది అయినా అక్రమంగా ప్రవర్తిస్తే అధ్యక్షుడు ఆ కాంగ్రెసువాదిపై శిక్షణచర్య తీసుకోవాలి. ప్రదేశ్ కాంగ్రెసు కార్యవర్గము, మంత్రివర్గము ఒకేసంస్థలో శాఖలనీ, రెంటింటికీ అవినాభావ సంబంధమున్నదనీ, ఒకదానిని కాదని ఇంకోటి శక్తివంతంగా పనిచేయలేదనీ గుర్తెరిగి రెండూ సంపూర్ణ సామరస్యంతో వ్యవహరించాలి.

### ఆత్మసంతృప్తి పనికిరాదు

ప్రధానమంత్రి నేటి సమావేశంలో ప్రసంగిస్తూ, ప్రభుత్వాలూ ప్రదేశ్ కాంగ్రెస్ సంఘాలూ అత్యంత సామరస్యంతో పనిచేయాలనీ, ప్రజాస్వామ్యంలో ప్రజలలో తామొక మహా కార్యంలో పాల్గొంటున్నామన్న సంతృప్తిభావం కలిగించటం అవసరమనీ అన్నారు. అందుకు కాంగ్రెసువారు ప్రజలతో నిరంతరం సంబంధం కలిగి వుండటమేకాక వారినుంచి అవసరమైనవి నేరుకోవా లన్నారు. కాంగ్రెసు వారికి ముఖ్యంగా ఆత్మసంతృప్తి పనికిరాదన్నారు. సామరస్యానికి కఠినమైన విధి నిషేధాలు ఏర్పర్చటం కుదరదనీ, న్యాయమైన మార్గాన్ని మాత్రమే సూచించగలమనీ, కొన్ని ప్రమాణాలను పాటించి నప్పుడే ప్రజాస్వామ్యం జయప్రదమవుతుందనీ అన్నారు.

## సత్యాగ్రహానికి ప్రపంచ దళం

(1 వ పేజీ తరువాయి)

యం జైల్లకెళ్లయినట్లు సంగతిసందర్భాలు తెలిసినవారొకరు అన్నారు.

ఈ సమావేశానికి అధ్యక్షత వహించిన రాష్ట్ర ముఖ్యమంత్రులు ఆయా రాష్ట్రాలలో గోవా విమోచనోద్యమం పట్లగల భావాభిప్రాయాలను వివరించారట.

తీర్మానంచేసేలోగా, అఖిల భారత కాంగ్రెసుసభ్యుల అభిప్రాయాలుకూడా తెలుసుకోవటానికి వీలవుతుందని తెలిసింది.

### సత్యాగ్రహులకు తీవ్రమైన దెబ్బలు

కార్వార్, సెప్టెంబరు 2: నిన్న ప్రొద్దున శ్రీ ప్రేంచంద్ జైన్ నాయకత్వాన గోవాలో ప్రవేశించిన 72 మంది సత్యాగ్రహులను పోర్చుగీసు పోలీసులు తెగబాది, సాయంత్రం భారత సరిహద్దులో పారవేసిపోయారు. మళ్ళీ గోవాలోకి వచ్చారంటే కాల్చివేస్తాము లేకపోతే కాళ్లు తోడివేస్తాము అని బెదిరించారట.

వీరు సరిహద్దునుంచి 16 మైళ్లు అడవిలో నడిచి పొయింజనీ గ్రామంవెళ్లి గ్రామచావిడిదగ్గర భారత పతాకను ప్రతిష్ఠించారట, గ్రామస్థులు కూడా వీరితోకలిసి పతాక వందనం చేశారట. అంతలో పోలీసులువచ్చి సత్యాగ్రహులగాంధీటోపీలుపతాకాలు లాక్కున్నారట. తర్వాత రెక్కలు కొరడాలు లాఠీలతో చిత్తమొచ్చినట్లు కొట్టారట. పిమ్మట అక్కడ్నించి ఆపక్కనున్న ఒకగట్టుమీదికి తీసుకువెళ్లి మళ్ళీ కొట్ట తన్నారట. చాలామంది సత్యాగ్రహులు స్పృహతప్పి పడిపోయారట. హైదరాబాదు నుంచి వచ్చిన శ్రీమతి భాగీరథీబాయిని కూడా దెబ్బలు కొట్టకుండా వుండలేదట. ఈవిడ గోవాలోకి వెళ్లటం ఇది రెండవ సారి. జలంధర్ నుంచి వచ్చిన డాక్టర్ హర్నాంసింగ్‌ని మరీ మరీ కొట్టటమే కాక, ఆయన గడ్డం, జుట్టూ కత్తిరించారట. అన్నం, నీళ్లూ ఇవ్వకుండా వుంచి, మధ్యాహ్నం 3 గంటలకు అందరినీ బస్సులో వేసి కార్వార్ సరిహద్దుకు తీసుకువచ్చి వదిలిపెట్టి పోయారట. ఇద్దరు సత్యాగ్రహులను కార్వార్ ఆస్పత్రిలో చికిత్సకుచేర్చారు. మిగతా వారు బెల్గాం వెళ్లి పోయారు.

ఆస్పత్రిలో చేరినవారిలో పాట్నా కాంగ్రెసు సంఘకార్యదర్శి శ్రీ తిలక్ ధారిఒకరు, ఆయన పొయింజనీలో జరిగిన దానినిగురించి చెబుతూ, గోవా పోలీసులు నిరాయుధ సత్యాగ్రహుల పట్ల దాక్షిణ్యంతో వున్నట్టు కనిపించారనీ, ఈ కొట్టటం తన్నటం అంతా పోర్చుగీసు పోలీసులేననీ, శ్రీమతి భగీరథీ బాయిని ఒక పోర్చుగీసు వాడు అవమానించబోగా ఒకసత్యాగ్రహితో పాటు కొందరు గోవా పోలీసులు కూడా అడ్డంవెళ్లి వారించారనీ చెప్పారు.

### గోవా విషయం పాక్ ప్రధాని వైఖరి

కరాచీ, సెప్టెంబర్ 2: ప్రధాని చౌదరీ మహమ్మదాలీ ఇవ్వాళ పత్రికా విలేఖరులతో గోష్ఠి జరుపుతూ--వలస విధానాన్ని రాజకీయ బానిసత్వాన్ని ఏ రూపంలో వున్నా సరే తాము నిరసిస్తామన్నారేగాని, గోవాను గురించి ఏమీ అనలేదు. గోవా విషయమై మీ అభిప్రాయమేమిటో విలేఖరులు గుచ్చి, గుచ్చి అడిగినా 'ఆ విషయమై నేను ఏమీ చెప్పకుండా వుండటమే మేలని ఎంచాన'ని తప్ప మరేమీ చెప్పలేదు. ఈ విషయంలో మీ 'వైఖరి' ఏమిటి అని అడిగితే 'వైఖరి లేదు' అన్నారు.

## రచ్చమరిసూగూరులో 26 ఇళ్లు ధ్వంసం

ఆదోని, సెప్టెంబరు 2: అతివృష్టి మూలంగా ఆదోనితాలూకా రచ్చమరి సూగూరు గ్రామంలో 26 ఇళ్లు కూలిపోయినవి. నాలుగురోజులు ప్రజలు కాలు కదపడానికి వీల్లేకపోయింది. గ్రామానికి రెండు ప్రక్కలా వున్న వాగులుపొంగి ఊరిమీదపడి ఇక్కువ నష్టం కలిగించాయి.

## ప్రభుత్వ పద్దుల తయారీ తనిఖీ శాఖల విభజన

### సిబ్బంది లభించగానే చేస్తారని శ్రీ నెహ్రూ ప్రకటన

న్యూఢిల్లీ, సెప్టెంబర్ 2 కేంద్ర ప్రభుత్వశాఖల కార్యనిర్వహణ పద్ధతిపై ఆడిటర్ జనరల్ శ్రీ అశోక్ చందా పరిశీలన జరిపి చేసిన సూచనలు ఖర్చులఅదుపులకూ, ఖర్చులు పరిమితించేందుకూ సంబంధించినవని ప్రధాని నెహ్రూ నేడు రాజ్యసభలో వెల్లడించారు, ఆయన సూచన లన్నిటినీ జాగ్రత్తగా పరిశీలించినమీదట, పద్దులు తయారుచేసేశాఖను (ఎకౌంట్స్) పద్దుల తనిఖీశాఖనూ (ఆడిట్) విడదీయటానికి ప్రభుత్వం నిశ్చయించుకున్నదని ప్రధాని తెలియజేశారు. తగిన సిబ్బంది లభించగానే ఇది అమలు జరుగుతుందన్నారు.

ఇంతేకాక, బ్రిటన్‌లో ఉన్నట్లుగా, ప్రతి ప్రభుత్వ శాఖలోనూ ఆ శాఖను ఆ శాఖలోనూ ఆర్థిక తనిఖీ అదుపు ఉద్యోగులను ఏర్పాటుచేయ నిశ్చయించామనీ, అప్పుడే కొన్ని శాఖల్లో పరీక్షార్థంగా దీనిని ప్రవేశపెట్టామనీ ప్రధాని తెలియజేశారు. ముందు ఆర్థికశాఖను సంప్రదించకుండానే కొత్త ఉద్యోగాలను ఏర్పాటు చేయటానికీ, ఖర్చులు పెట్టటానికీ వివిధ శాఖల అధిపతులకూ అధికారాలు చాలా హెచ్చించటంకూడా జరిగిందని నెహ్రూ వెల్లడించారు.

(ఇతర శాఖలపై ఆర్థికశాఖ అజమాయిషీ విషయంలోనే అభిప్రాయభేదం వచ్చి ఆర్థికమంత్రి దేశ్‌ముఖ్ రాజీనామా ఇవ్వాలని ప్రయత్నించగా, తరవాత అది సర్దుబాటు అయినట్లు లోగడ వార్తలు వచ్చి ఉన్నవి. ప్రతిదానికీ ఆర్థికశాఖ అజమాయిషీ అవసరమనటంవల్ల నిర్మాణ కార్యక్రమం వెనకపడుతున్నదని మిగిలినశాఖలు [illegible] ఉన్నవి.)

### రైల్వేబోర్డు సంస్కరణ

చాందా చేసిన ఇతర సిఫార్సులు అంత ముఖ్యాంశాలు కావని నెహ్రూ అన్నారు. ఇటీవల రైల్వేబోర్డులో చేసిన సవరణ చాందా సిఫార్సుకు వ్యతిరేకంగా లేదా అని అడగ్గా, కొన్ని సిఫార్సుల్ని ప్రభుత్వం ఆమోదించలేదనీ, రైల్వేబోర్డుమీద చేసిన సిఫార్సును బాగా పరిశీలించినమీదటే తోసివేశిందనీ నెహ్రూ తెలియజేశారు.

## పట్టణాల మురుగు పారుదల

### పురపాలక సంఘాలకు సహాయం

కర్నూలు, సెప్టెంబరు 2. మూడవ తరగతికి చెందిన పురపాలక సంఘాల, నీటి సరఫరా, మురుగుపారుదల ప్రణాళికలను, నాలుగు పరతులపై, ప్రభుత్వం ధనసహాయం చేయ నిశ్చయించింది.

ఈ ప్రణాళికలపై పెంచేటి ఛార్జీగా పురపాలక సంఘాలు ఎంత మొత్తమును ప్రజలనుండి వసూలు చేయడానికి వీలుంటుందో, సరిగా అంత మొత్తమును, ప్రభుత్వం గ్రాంటుగా యిస్తుంది.

పురపాలక సంఘాధ్యక్షుల మండలి కార్యవర్గ తీర్మానానుసారం యీ విధంగా ధనసహాయం చేయడానికి ప్రభుత్వము నిశ్చయించినట్లు ఈసాయంత్రం ప్రకటించారు.

### పరతులు

ప్రభుత్వం విధించిన నాలుగు పరతులు. (1) ఈప్రణాళికలను రాష్ట్ర ప్రభుత్వ ప్రజారోగ్యశాఖకు చెందిన, ఇంజనీర్ల సహాయంతో అమలు జరిపించాలి. (2) ప్రణాళికల ఖర్చు భరించు (పెంటేజీలు సహా) యావత్తు, పురపాలకసంఘం స్వంతసొమ్ము నుండి, ప్రభుత్వానుమతితో సేకరించిన అప్పునుండి లేదా ప్రభుత్వం మంజూరుచేసే డబ్బు నుండి భరించాలి. (3) ప్రభుత్వం నిర్ణయించే రేట్లప్రకారం పురపాలక సంఘం నీటిపన్ను, మురుగుపారుదలపన్ను విధించాలి (4) ప్రభుత్వం యిచ్చే గ్రాంటును పెట్టుబడిఖర్చులు తగ్గించుకొనడానికి వినియోగించాలి. లేదా నీటి సరఫరా, మురుగుపారుదల ప్రణాళికకు సంబంధించిన భాగాలలో జమకట్టుకొని అవులయిన ప్రణాళికల పోషణకు, లేదా విస్తరణకు వినియోగించాలి. తగినంతగా డబ్బులేనందున, మొదటితరగతి రెండవతరగతి పురపాలక సంఘాలకు గూడా యీసహాయం చేయజాలకున్నందుకు ప్రభుత్వం విచారం వెల్లడించింది.

## 'లుంబినీ' లో వనము బాటలు

### బుద్ధుని జన్మస్థానం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 2: బుద్ధభగవానుడు జన్మించిన లుంబినీ వనాన్ని తత్పరిసరాలనూ బాగుచేసి, నూతన నిర్మాణాలతో తీర్చి దిద్దిందుకు కారణం ఇవ్వాళ రాజ్యసభలో తెలియచేయబడింది.

ఈలుంబినీవనం నేపాల్‌లో ఉంది. అందుచేత ఈపనిని ఆ ప్రభుత్వమైనా చేయిస్తుంది లేదా వారి అనుమతితో భారత ప్రభుత్వం చేయిస్తుంది. ఈ విషయమై ఆప్రభుత్వంతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతున్నాయి.

ఆలుంబినీ వనానికి వెళ్లేమార్గం భారతదేశాలలో వున్నంత మేరా బాగుచేయించే బాధ్యత ఉత్తర ప్రదేశ్ ప్రభుత్వానిది. ఆప్రభుత్వానికి కూడా కేంద్ర ప్రభుత్వం సహాయం చేస్తుంది నేపాల్ ప్రభుత్వానికి కూడా అవసరమైతే సహాయం చేస్తుంది.

## దేశ సమీపంలోని సముద్రప్రాంతం

### ప్రభుత్వానికి హక్కు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 1: భారత భూమిని ఆనుకొని, భారత జలభాగాలకు మీరి, సముద్రంలోవున్న తీరాంచల భూమిపైనా, దాని అడుగున వుండే సంపదలమీదా భారతదేశానికి సంపూర్ణ అనన్య సర్వతంత్రాధికారం వున్నదని రాష్ట్రపతి డాక్టరు రాజేంద్ర ప్రసాద్ ఇవ్వాళ ప్రకటించారు.

ఈసంగతిని వెల్లడిస్తూ విదేశాంగ వ్యవహారాల శాఖవారొక ప్రకటన చేశారు. అందులో ఇట్లావుంది: ఈ తీరాంచల భూమిపైనా, దానిఅడుగునా విలువైన సహజ సంపదలున్నట్లు ప్రసిద్ధము. ఆధునిక సాంకేతిక ప్రావీణ్యం వల్ల వాటిని వినియోగానికి తెచ్చుకొనటము సాధ్యమవుతున్నది. సముద్రతీరముగల ప్రతిదేశానికీ, ఇటువంటి తీరాంచలభూమిలో వినిదోచుకుంటుందో కనుగొని, దానిని వినియోగానికి తెచ్చుకొనే సర్వతంత్రాధికారం వున్నటు అంతర్జాతీయ ఆచారాలవల్ల రూఢమైనది.

## అదనపు ఆదాయం అంచనా

మద్రాసు సాధారణ అమ్మకాల పన్నుచట్టాన్ని, పొగాకు అమ్మకాల పన్నుచట్టాన్ని సవరించడం మూలంగా, అదనంగా రాగల ఆదాయంగురించి, ప్రభుత్వం సమాచారం సేకరిస్తున్నది.

పన్నురకం, అతిసాజూకురకం, విల్లు వస్త్రాలపైనా, అదనంగా అమ్మకం పన్ను 0-1-6 చొప్పున వేస్తే సాలీనా 40 లక్షలు రాగలదనీ, వజ్రాలువగైరా విలువైన రాళ్లపై పన్ను అదనపుఅమ్మకం పన్నుద్వారా రూ. 2 లక్షలు రాగలదనీ, గోపాలరెడ్డిగారు బడ్జెట్ ప్రతిపాదించేటప్పుడు శాసన సభలో చెప్పిన సంగతి పాఠకులకు విదితమే.

చిల్లరగా ఒక్కొక్కటి మూడు పైసలకు అమ్మతలచి వున్న సిగిరెట్లను, చిల్లర వర్తకులకు మూడు పైసలకు తక్కువగా అమ్మే వర్తకుల మీద పన్నును ప్రభుత్వం తగ్గించదలచింది. మొత్తం అమ్మకం మీద నూటికి 10 వంతులుండే పన్నును 8 1/8 వంతులకు ప్రభుత్వం తగ్గిస్తుంది.

### అక్రమ వ్యాపారం అరికట్టడం

ప్రస్తుతం అమలులో వున్న చట్టం క్రింద పొగాకుపై పన్నుల ద్వారా ప్రభుత్వానికి రు 755 వేల ఆదాయం వస్తున్నది. సిగరెట్లపై పన్ను వేయడంలో ఉద్దేశ్యం సిగరెట్ల ధరలను, యితరరాష్ట్రాలలో ఉండే ధరలతో సమంచేసి, దొంగతనంగా రవాణా చేయడం తగ్గించాలనే.

## వృత్తిపన్ను గరిష్ఠ ప్రమాణం హెచ్చింపు

### రాజ్యాంగ సవరణకు ప్రభుత్వ ఆలోచన

న్యూఢిల్లీ, సెప్టెం 3: వివ్యక్తి అయినా వృత్తిపన్ను ద్వారా చెల్లించవలసిన గరిష్ఠ మొత్తాన్ని పెంచేందుకు పన్నుల విచారణ సంఘం చేసిన సిఫార్సును అమలుజరిపే నిమిత్తం రాజ్యాంగాన్ని సవరించాలని కేంద్ర ప్రభుత్వం ఆలోచిస్తున్నది. నేడు లోక్‌సభలో శ్రీ ఎస్. ఎస్. లింగం ప్రశ్నకు జవాబిస్తూ ఆర్థిక మంత్రి శ్రీ దేశ్‌ముఖ్ ఈ విషయం వెల్లడించారు.

## గోకవరం వద్ద బాటకు ఆటంకం

మదరాసు, సెప్టెంబరు 3 రాజమహేంద్రవరం గోకవరంరోడ్డుపై 17-4 మైలు వద్దగల రేటిబాటు వరదమూలాన దాటవీలు లేకుండా వున్నది. ఈ అవరోధం 3 రోజులపర్యంతం ఉండవచ్చును.

# వాల్మీకి రామాయణం

శ్రీ శ్రీనివాస శిరోమణి

## సుందరకాండ

౧

జాంబవంతుడు ప్రోత్సాహము చేసినందువల్ల సముద్రము దాటి పోయే విషయములో హనుమంతుడు తన శక్తిని తెలుసుకొన్నాడు. అంతట ఆ శత్రుకర్శనుడు రావణాసురుడు ఎత్తుకొని పోయిన సీతాదేవి ఎక్కడ వుందీ వెతకడానికి దేవగాయకులు అయిన చారణులు సంచారము చేసే ఆకాశమార్గాన పోవలెను అనుకొన్నాడు. ఆ దుర్ఘట కార్యాన్ని తోడు లేకుండానూ సాటి లేకుండానూ సాధించ తలచుకొన్నాడు. ఆ మహేంద్రపర్వతము మీద నిలుచుని మెడ నిక్కబెట్టి తలఎత్తి ఆబోతు వలె అమితదర్పముతో సముద్రాన్ని చూడ సాగినాడు.

ఆ ధైర్యవంతుడు ఆ మహాబలవంతుడు హనుమంతుడు వైడూర్యమణుల వలెనూ సముద్రజలాల వలెనూ ఉన్న అక్కడి పచ్చిక బయళ్లలో అటూ ఇటూ సంచారము చేసినాడు. పక్షులను బెదిరించినాడు. పెద్దపెద్ద చెట్లను ఎదురు రొమ్ములతో పడతోసినాడు. బలరేగిన సింహమువలె అనేకమృగాలను హతమార్చినాడు.

ఆ మహేంద్రపర్వతములో వివిధధాతువులూ స్వతస్సిద్ధముగా ఉన్నవి. అందువల్ల నీలముపచ్చ్చతోనూ ఎఱ్ఱటి రంగుతోనూ ఆకుపచ్చరంగుతోనూ కసుపుపచ్చరంగుతోనూ తెలుపూ నలుపూ కలసినబూడిదరంగుతోనూ అలంకరించినట్టు ఆ పర్వతము శోభాయమానముగా కనపడుతూ ఉంటుంది. కామరూపులు అయిన యక్షులూ కిన్నరులూ గంధర్వులూ దేవతలతో సరిసమానము అయిన పన్నగులూ చక్కగా అలంకరించుకొని అక్కడ కన్నుల పండుగగా విహరిస్తూ వుంటారు. ఆ ఉత్తమోత్తమము అయిన మదపుటేనుగులకు అది పునికిపట్టు. అప్పుడు ఆ మహేంద్రపర్వతము మీద నిలుచుని ఉన్న ఆ హనుమంతుడు పెద్ద మడుగు ముందు నిలుచున్న మదపుటేనుగు వలె కనిపించినాడు.

హనుమంతుడు అక్కడ నుంచి ఎగిరి పోవలెను అనుకొన్నాడు. సూర్యుడికీ ఇంద్రుడికీ వాయుదేవుడికీ బ్రహ్మదేవుడికీ పంచభూతాలకూ నమస్కారము చేసినాడు. అంతట రామాభ్యుదయము కోసము దక్షిణదిక్కుకు ఎగిరి పోవడానికి కృతనిశ్చయుడు అయినాడు. తూర్పు దిక్కుకు తిరిగి తన జన్మకు కారణభూతుడు అయిన వాయుదేవుడికి మళ్లీ నమస్కారము చేసినాడు. పర్వ కాలములో పొంగే మహాసముద్రము వలె వానరులు అందరూ చూస్తూ ఉండగా హనుమంతుడి దేహము అంతు లేకుండా పెరిగింది.

అట్లా అపరిమితముగా తన కాయాన్ని పెంచిన హనుమంతుడు తన చేతులతోనూ కాళ్లతోనూ ఆ మహేంద్రపర్వతాన్ని కుదిలించినాడు. ఎప్పుడూ కదలని ఆ మహేంద్రపర్వతము అప్పుడు ఒక ముహూర్తముసేపు కదులుతూ ఉండి పోయింది. ఆ కుదుపుకు అక్కడ చెట్లను పూసిన పూలు అన్నీ రాలి ఆ పర్వతాన్ని అంతా కప్పివేసినవి. ఘుమఘుమవాసనలు గుబాళిస్తూ అప్పుడు అది అచ్చము పూలకొండ వలె తోచింది.

ఆ మహాపరాక్రమవంతుడు హనుమంతుడు కుదిలించిన కుదుపుకు మదపుటేనుగు కార్చే మదధారల వలె ఆ మహేంద్రపర్వతములో నుంచి జలధారలు కారినవి. ఆ కుదుపుకు రాళ్లు అన్నీ విచ్చిపోయి బంగారూ వెండీ ఇనుమూ వారికలు ఆ మహేంద్రపర్వతము మీద అప్పుడు అగుపించినవి. భగభగమండే అగ్నిహోత్రముధ్యజ్వాలలో నుంచి పొగలు పైకి లేచేటట్టు ఆ పర్వతశిఖరము మీది నుంచి నల్లటి మణిశిలల బండలు పైకి లేచినవి.

ఆ మహాబలవంతుడు హనుమంతుడు ఆ మహేంద్రపర్వతాన్ని అట్లా కుదిలిస్తూ ఉంటే ఆ కుదుపుకు ఆ పర్వతగుహలలో ఉంటూ ఉన్న జంతువులు అన్నీ భయంకరముగానూ వికృతముగానూ అరిచినవి. ఆ జంతువుల అరుపులు అక్కడి వనాలలో మారుమ్రోగడమే కాకుండా ఈ భూమి మీద దిగంతాల వరకూ వినిపించినవి. ఆ పర్వతము మీద ఉంటూ ఉన్న మహాసర్పాలు స్వస్తిక చిహ్నాలు కనపడేట్టు పెద్దపెద్ద పడగలు విప్పి నిప్పులు కక్కుతూ కోరలతో అక్కడి రాళ్లను కరిచి వేసినవి. ఆ కుపితసర్పాలు వేసిన కాట్లకు ఆ రాళ్లు అన్నీ భగభగమండుతూ ముక్కలు ముక్కలుగా పగిలి పోయినవి. అటువంటి విషాగ్నిని హరించే ఓషధులు ఎన్నో ఆ పర్వతముమీద ఉన్నప్పటికిన్నీ అవి ఏవీ ఆ సమయాన ఆ విషాగ్నిజ్వాలలను చల్లార్చలేక పోయినవి.

ఆ కుదుపుకు ఆ పర్వతము మీద ఉంటూ ఉన్న తాపసులు వృధివ్యాది భూతాలతో ఆ మహేంద్ర పర్వతము బ్రద్దలు అయిపోతూ ఉంది అని భయపడ్డారు. ఒంటి నిండా రక్తచందనము పూసుకొని మెడలలో ఎఱ్ఱటి పూల దండలు వేసుకొని తమ తమ ప్రియురాండ్రతో అప్పుడు అక్కడ మద్యపానము చేస్తూ ఉన్న విద్యాధరులు భయభ్రాంతులు అయిపోయి చేతులలో ఉన్న పాన పాత్రలనూ మహావిలువ అయిన భోజనపాత్రలనూ బంగారు చెంబులనూ దుర్లభము అయిన లేహ్యాలనూ రకరకాల భక్ష్యాలనూ వివిధమాంసాలనూ ఎద్దు తోలు వేసిన డాళ్లనూ బంగారు పిడులు వేసిన ఖడ్గాలనూ అక్కడనే ఆ పానభూమిలోనే వదలిపెట్టి ముత్యాల కంఠహారాలతోనూ అందెలతోనూ బాహుబందులతోనూ కంకణాలతోనూ కళకళలాడుతున్న తమ తమ ప్రియురాండ్రను వెంట వేసుకొని పైకి ఎగిరినారు. మహావిద్యాప్రభావము వల్ల (అణిమాద్యష్టసిద్ధుల వల్ల) ఆ విద్యాధరులు అట్లా ఎగిరిపోయి ఆధారము ఏమీ లేని ఆకాశములో నిలుచుని తమ తమ ప్రియురాండ్రను వెంట తెచ్చుకొన్నందుకు సంతోష పడుతూనూ ఆ మహేంద్ర పర్వతము అట్లా కదులుతూ ఉన్నందుకు ఆశ్చర్య పడుతూనూ మద్యపానము వల్ల ఎఱ్ఱటి తామరరేకుల వంటి కన్నులతో కింది కి చూడ సాగినారు.

అప్పుడు ఆ పర్వతగుహలలో ఆత్మధ్యాన నిమగ్నులు అయి ఉన్న పరమ ఋషులు ఆకాశములో నిలుచుని ఉన్న ఆ విద్యాధరులతో "ఓ విద్యాధరులారా, అదుగో ఆ పర్వతాకారుడు వాయుదేవుడి పుత్రుడు, హనుమంతుడు. తిమితిమింగిలాలతో ఉన్న సముద్రాన్ని అమితవేగముతో దాటిపోవలెను అనుకొంటున్నాడు. రామాభ్యుదయము కోసమూ రామాభ్యుదయము కాంక్షిస్తూ ఉన్న వానరుల కోసమూ ఈ హనుమంతుడు మహా దుర్ఘటకార్యము తలపెట్టినాడు. ఎవరికీ దాట నలవికాని సముద్రాన్ని దాటి ఆవతలిగట్టుకు పోవలెను అనుకొంటున్నాడు" అని చెప్పినారు. ఈ మాటలు విద్యాధరులు విన్నారు. ఇంత అంత అని నిర్ణయించ నలవికాని ఆకారముతో పెరిగిపోయిన హనుమంతుణ్ణి ఆ మహేంద్రపర్వతముమీద చూచినారు.

అప్పుడు ఆ పర్వతాకారుడు హనుమంతుడు ఒళ్లు విరిచినాడు. అతని ఒంటిమీది రోమాలు అన్నీ నిక్కబొడుచుకొన్నవి. అంతట మహామేఘము వలె గర్జించినాడు. గరుత్మంతుడు పామును వలె దట్టముగా పెరిగిన వెంట్రుకలతో చుట్టు చుట్టుకొని ఉన్న తన తోకను విదిలించినాడు. అట్లా విదిలించిన ఆ హనుమంతుడి తోక ఆకాశములో గరుత్మంతుడు ఎత్తుకొనిపోతూ ఉన్న మహాసర్పము వలె కనిపించింది.

అంతట హనుమంతుడు ఎగిరిపోతలచి ఇనుపగుదియలవంటి తన బాహువులను ముందుకు పారచాచి బిగపట్టినాడు. నడుమును కుంచించినాడు. కాళ్లను ముణుచుకొన్నాడు. ఆ కాంతిమంతుడు ఆ వీర్యవంతుడు అంతట తన భుజాలనూ మెడనూ వంచి తనలో ఉన్న శక్తినీ సామర్థ్యాన్నీ పరాక్రమాన్నీ అవేశింప చేసుకొన్నాడు. కనుమూపు మీదవరకూ ఆ దారిని తేరిపారచూచినాడు. ప్రాణాయామమును హృదయములో బంధించినాడు. శ్రవణేంద్రియాలను స్తంభింప చేసినాడు. రెండు పాదాలనూ ఆ కొండకు తిన్నగ పట్టినాడు.

ఆకాశములోకి ఎగిరిపోబోతూ ఉన్న ఆ మహాబలవంతుడు ఆ కపికుంజరుడు హనుమంతుడు అప్పుడు వానరులను అందరినీ చూచి "ఓ వానరులారా, రాయి వేగముతో పోయే రామబాణము వలె నేను రావణాసురుడు పరిపాలిస్తూ ఉన్న లంకాపట్టణానికి పోతాను. సీతాదేవి ఒకవేళ అక్కడ కనపడక పోయేటట్టయితే అక్కడనుంచి అదే వేగముతో దేవలోకము పోతాను. అక్కడకూడా సీతాదేవి కనపడకపోయేటట్టయితే అలసట లెక్కచేయకుండా మళ్లీ లంకాపట్టణానికి పోతాను. రావణాసురుణ్ణి కట్టివేసి ఇక్కడికి ఈడ్చుకొని వస్తాను. ఏవిధముగానైనా అయినా ఈ పని సాధిస్తాను. సీతాదేవిని వెంటపెట్టుకొని వస్తాను. అట్లా కాకపోయేటట్టయితే రావణాసురుడితోకూడా లంకాపట్టణాన్ని పెల్లగించి ఎత్తుకొని వస్తాను" అని చెప్పినాడు.

అంతట ఆవేగవంతుడు హనుమంతుడు తనకు రెక్కలు ఉన్నట్టు భావించి నిర్విచారముగా విశాలమైన ఆకాశములోకి ఎగిరినాడు.

ఆ కపికుంజరుడు హనుమంతుడు ఎగిరిన ఉరవడికి ఆ పర్వతము మీద ఉన్న చెట్లుఅన్నీ పెల్లగిలి కొమ్మలతోనూ కొమ్మల కొనలను ఉన్న పూలతోనూ ఆ కొమ్మలమీద ఉన్న లకుముకిపిట్టలతోనూ ఆకాశానికి ఎగిరి దూరదేశానికి పోయే బంధువును సాగనంపడానికి వెంటపోయే బంధువులవలె ఆ హనుమంతుణ్ణి ఒక్క ముహూర్తము సేపు వెంబడించినవి. మద్దిచెట్లూ ఇంకా ఇతర మహావృక్షాలూ రాజు వెంట పోయే సైన్యాలవలె ఆ హనుమంతుడి వెంట పోయినవి. వికసపూచిన ఆ చెట్లు అన్నీ అట్లా ఎగిరిపోతూ ఉంటే హనుమంతుడి పర్వతాకారము అత్యద్భుతముగా కనిపించింది.

పూర్వము దేవేంద్రుడికి భయపడి పర్వతాలు సముద్రములో పడి పోయినట్టు బాగా బరువుగా ఉన్న చెట్లు సుభాలున ఆ సముద్రములో పడిపోయినవి. మేఘసమానుడు అయిన హనుమంతుడి దేహము అంతటా నానారకాల పూలూ మొగ్గలూ మొలకలూ కమ్ముకొన్నందువల్ల రాత్రిపూట మిణుగురు పురుగులతో ప్రకాశించే పర్వతము వలె కనిపించినాడు. ఆ హనుమంతుడి ఉరవడికి ఎనకపడి పోయిన చెట్లు తమ పూలను రాల్చివేసి ఇంటికి పోయే చుట్టాన్ని సాగనంపి వెనకకు మళ్లిన బంధువుల వలె కనపడకుండా సముద్రములో మునిగిపోయినవి. బాగా బరువు చెట్లు ఆ హనుమంతుడి వెంట కొంతదూరము పోయి కిందపడి పోయినవి. తేలిక చెట్లు వరి కొంతదూరము ఆ వానరోత్తముడి వెంట పోయినవి. బాటకన్నా తేలిక అయిన రకరకాల రంగుల పూలు ఇంకా ఇంకా కొంతదూరము పోయి రాలి సముద్రములో పడ్డవి. అట్లా సముద్రజలాల మీద పడ్డ పూలు అన్నీ చీకటిలో ఆకాశాన ఉదయించిన నక్షత్రాలవలె కనిపించినవి.

సముద్రములో రాలిపోకుండా ఒంటి మీద నిలిచిపోయిన రంగు రంగుల పూలతో ఉరవడిగా పోతూ ఉన్న హనుమంతుడు ఆకాశములో మెరపుతీగలలో పోయే మహామేఘము వలె కనిపించినాడు. ఆకాశములోకి నిక్క చాచిన హనుమంతుడి రెండు బాహువులూ పర్వతశిఖరములో నుంచి బయటికి వెళ్ళుకొని వచ్చిన అయిదుతలల పాముల జంటవలె కనిపించినవి. అట్లా పోతూ ఉన్న ఆ హనుమంతుడు మెడను వంచినప్పుడు మహాసముద్రజలాలను తరంగాలతో కూడా త్రాగపోతున్న వాడివలెనూ మెడను పైకి ఎత్తినప్పుడు ఆకాశాన్ని మ్రింగి వేయబోతున్న వాడి వలెనూ కనిపించినాడు. ఆ హనుమంతుడి గుండ్రని తేనె రంగు కన్నులు ఏకకాలాన ఉదయించిన సూర్యచంద్రులవలె కనిపించినవి. ఎఱ్ఱని ముక్కుతో ఎఱ్ఱపడిపోయిన హనుమంతుడి ముఖము సంధ్యారాగము అలముకొన్న సూర్యమండలము వలె కనుపించింది.

అట్లా ఎగిరిపోతూ హనుమంతుడు పైకి ఎత్తిన పొడుగాటి తోక ఆకాశములో ఇంద్రధ్వజము వలె కనిపించింది. ఆ హనుమంతుడు ఆ తోకను తెలినచుట్టూ గుండ్రముగా చుట్టుకొన్నాడు. అప్పుడు అతడు పరివేషము మధ్యను ఉన్న సూర్యుడివలె తేజరిల్లినాడు. ఎఱ్ఱగా ఉన్న అతని కటిప్రాంతము పర్వతాన్ని బ్రద్దలు చేసుకొనివచ్చిన గైరికధాతువు వలె కనిపించింది. ఆ వానరసింహుడు హనుమంతుడు అట్లా అమితవేగముతో సముద్రాన్ని లంఘిస్తూ ఉంటే అతని చంకలలో నుంచి దూసుకొని పోయేగాలి మేఘము వలె గర్జించింది. ఉత్తర దిక్కు నుంచి దక్షిణదిక్కుకు పోతూ ఉన్న ఆ హనుమంతుడు అప్పుడు ఆ ఆకాశములో ఉత్తరమునుంచి దక్షిణదిక్కుకు వ్యాపిస్తూ ఉన్న తోకచుక్క మాదిరిగా కనిపించినాడు.

మహాకాయముతో ఆకాశములో సూర్యుడివలె పోతూ ఉన్న ఆ హనుమంతుడు తన తోకను ముడుస్తూనూ వెల్లకిలా వేస్తూనూ ఉంటే నడికట్టుతాళ్లు తెంచుకొని పరుగెత్తుతున్న ఏనుగువలె కనిపించినాడు. ఆకాశములో ఎగిరిపోతూ ఉన్న ఆ హనుమంతుడి కాయమూ కింద సముద్రములో పడుతూ ఉన్న అతని నీడా ఏకము అయి గాలికి పోతున్న ఓడవలె కనిపించినాడు. ఆ హనుమంతుడు ఎంత మేర సముద్రము దాటుతూ ఉంటే అతని వేగానికి అంత మేరా సముద్రానికి పిచ్చెత్తినట్టు అయిపోయింది. ఆ హనుమంతుడు అట్లా అమితవేగముతో పోతూ వుంటే కొండలుఅంత ఎత్తున పైకిలేచిన తరంగాలు అతనిరొమ్ముల తాకిడికి చిందరవందర అయిపోయినవి. అప్పుడు ఆ హనుమంతుడి ఉరవడికి రేగిన గాలీ మేఘాల గాలీ ఏకము అయి చేసిన భయంకర ధ్వనికి సముద్రము కంపించి పోయింది. ఆ కపిశార్దూలము ఆ సముద్రము అలలను ఒరసుకొని పోతూ ఉంటే భూమ్యాకాశాలను వేటికి అవిగా చీల్చివేస్తున్న వాడి వలెనూ ముందువేగముతో పోతూ ఉంటే మేరుమందర పర్వతాల వలె పైకి లేస్తూ ఉన్న సముద్రతరంగాలను లెక్క వేస్తున్న వాడివలెనూ సాగిపోయినాడు. ఆ హనుమంతుడి వేగానికి సముద్రజలము మేఘమండలము వరకూ లేచి శరత్కాలమేఘము వలె ఆకాశాన శోభించింది. ఒంటిమీద బట్టలు తొలగిపోతే అవయవాలు అన్నీ బయటపడ్డట్టు అప్పుడు ఆ సముద్రములో తిములూ తిమింగిలాలూ మొసళ్లూ మొదలు అయిన జలజంతువులు అన్నీ బయటపడ్డవి. అట్లా ఆకాశములో దాటిపోతూ ఉన్న హనుమంతుణ్ణి ఆ సముద్రములో ఉన్న పాములు అన్నీ చూచి గరుత్మంతుడు అనుకొని భయపడ్డవి. అట్లా పోతూ ఉన్న హనుమంతుడి నీడ ఆ సముద్ర జలాలమీద ముప్ఫయి యోజనాల పొడుగునా పది యోజనాల వెడల్పునా అత్యాశ్చర్యముగా కనిపించింది. అట్లా సముద్రములో వ్యాపించిన ఆ హనుమంతుడి నీడ అతనితో పాటు సముద్రము మీద పోతూ ఉంటే ఆకాశములో పోయే దట్టము అయిన మేఘపంక్తి వలె తోచింది. ఆ మహాతేజస్వి ఆ మహాకాయుడు నిరాధారము అయిన వాయుమార్గాన పోతూ ఉంటే రెక్కలపర్వతము ఎగిరిపోతూ ఉన్నట్టు కనిపించింది. ఆ మహాబలవంతుడు హనుమంతుడు అట్లా పోతూ ఉంటే అప్పుడు ఆ సముద్రము పక్కలకు తొలగి మధ్యను తొట్టిగా ఉంటే కాలువవలె కనిపించింది. గరుత్మంతుడి వలె ఎగిరిపోతూ ఉన్న ఆ హనుమంతుడు వాయుదేవుడి వలె మేఘాలను వెంట లాగుకొని పోయినాడు. ఆ హనుమంతుడిని వెంబడించిన తెలుపూ ఎరుపూ బూడిదరంగు మేఘాలు అప్పుడు ఆకాశానికి అలంకారముగా కనిపించినవి. ఆ హనుమంతుడు అమితవేగముతో పోతూ ఉంటే మేఘాల చాటుకు పోతూనూ బయటికి వస్తూనూ మబ్బులతో దాగుడుమూతలు ఆడే చంద్రుడి వలె కనిపించినాడు.

ఆకాశములో అట్లా అమితవేగముతో ఎగిరిపోతూ ఉన్న ఆ హనుమంతుడి మీద అప్పుడు దేవతలూ దానవులూ గంధర్వులూ పూలవాన కురిపించినారు. ఆ హనుమంతుడికి దేహతాపము ఎత్తకుండా సూర్యుడు ఎండ కాసినాడు. వాయుదేవుడు రామకార్యార్థసిద్ధి కోసము అనుకూలముగా గాలి వీచినాడు. అట్లా ఆకాశములో ఎగిరిపోతూ ఉన్న హనుమంతుణ్ణి మహర్షులు అందరూ స్తోత్రము చేసినారు. దేవతలూ గంధర్వులూ ఆ మహాతేజోవంతుణ్ణి పొగడినారు. అలుపు లేకుండా ఎగిరిపోతూ ఉన్న ఆ హనుమంతుణ్ణి నాగులూ యక్షులూ రాక్షసులూ కిన్నరులూ కింపురుషులూ మెచ్చుకొన్నారు.

ఆ కపిశార్దూలము హనుమంతుడు అట్లా దాటిపోతూ ఉంటే సముద్రుడు అతనికి సాయపడవలెను అనుకొన్నాడు. ఇక్ష్వాకువంశీయుల మీద అతనికి ఎంతో గౌరవము ఉంది. రామకార్యార్థి అయిపోతూ ఉన్న హనుమంతుడికి సహాయపడక పోయేట్లయితే తనను అందరూ అన్ని విధాలా నిందిస్తారు అనీ ఇక్ష్వాకు వంశీయుడు అయిన సగరచక్రవర్తి తనను వృద్ధి చేసినాడు అనీ ఆ ఇక్ష్వాకు వంశీయుడు అయిన రాముడికి హనుమంతుడు సహాయము చేస్తూ ఉన్నందువల్ల అతడు అలసిపోకుండా తాను ఏది అయినా సదుపాయము చేయవలెను అనీ సముద్రుడు అనుకొన్నాడు.

ఆ వస్తూ ఉన్న హనుమంతుడు కొంతసేపు అలుపు తీర్చుకొనే ఏర్పాటు చేసేటట్లయితే తక్కిన దారి అంతా సుఖముగా పోగలుగుతాడు అని సముద్రుడు మనస్సులో నిశ్చయించుకొని తనలో దాగుకొని ఉన్న పర్వత శ్రేష్ఠుణ్ణి మైనాకుణ్ణి చూచి "ఓ హిరణ్యనాభా పాతాళలోకములో ఉంటూ ఉన్న రాక్షసులు పైకి లేచి రాకుండా వాళ్ల ద్వారానికి మూతబండగా ఉంటున్నావు. వాళ్లు ఆ రాక్షసులు పరాక్రమవంతులు. పైకి రావలెను అని ఎంతో ప్రయత్నము చేస్తే నీవు అపరిమితాకారముతో ఆ పాతాళద్వారానికి అడ్డము అయినావు. నీకు కిందికీ మీదికీ పక్కలకూ పెరిగే శక్తి ఉంది.

అందువల్ల నీతో చెప్పుతున్నాను. నీవు ఇప్పుడు పైకి లేవవలెను. రామకార్యార్థము హనుమంతుడు ఎగిరి ఆకాశములో వస్తూ ఉన్నాడు. ఆ కపిశార్దూలము తలపెట్టింది పరమ సాహసకృత్యము. ఇక నీ మీదిగా పోతాడు. రాముడు ఇక్ష్వాకువంశీయుడు. ఆ వంశీయులు అందరూ నాకు పూజనీయులు. నీవు నాలో దాగుకొని నా అభ్యుదయాన్ని కాంక్షిస్తూ ఉన్న వాడవు అందువల్ల రాముడు నీకు మరింత పూజనీయుడు. కాబట్టి నీవు నాకు సాయపడవలెను. నా పనిని నీవు ఇప్పుడు తప్పకుండా చేసిపెట్టవలెను. ఏ పని చేయవలసిన సమయములో ఆ పని చేయక పోయేట్లయితే సత్పురుషులకు కోపము వస్తుంది. నీవు నీళ్లలోనుంచి పయికి రా. ఈ హనుమంతుడు నీ మీద నిలుస్తాడు. ఈతడు ఆకాశమార్గాన ఎగిరిపోయే వాండ్లలో శ్రేష్ఠుడు. అతిథిగా వస్తూ ఉన్నాడు. కాబట్టి మనకు పూజ్యుడు.

"ఓ మైనాకుడా, నీ బంగారు శిఖరాల మీద ఇదివరకు దేవతలూ గంధర్వులూ విహరించినారు. ఇప్పుడు హనుమంతుడు నీ మీద నిలుచుని అలుపుతీర్చుకొంటాడు. ఆ తరువాత మిగతా దారి అంతా హాయిగా పోతాడు.

"ఓ మైనాకుడా, రాముడు పరమ సజ్జనుడు. భార్యను పోగొట్టుకొన్నాడు. అతని భార్య మైథిలి ఇప్పుడు పరదేశవాసము చేస్తూ ఉంది. సీతారాములను ఒకచోటికి చేర్చడానికి ఇప్పుడు ఆకాశమార్గాన హనుమంతుడు ఎగిరి పోతున్నాడు. ఆ రాముడి కోసము ఈతడు పడుతున్న శ్రమ గమనించు. ఇక నీవు పయికి రా" అన్నాడు.

ఈ విధముగా సముద్రుడు చెప్పిన మాటలను ఆ మైనాకుడు విన్నాడు. మేఘమండలాన్ని భేదించుకొనివచ్చే సూర్యుడివలె ఆ సముద్రజలాలలోనుంచి మైనాకుడు మహోన్నతవృక్షాలతోనూ లతలతోనూ బంగారు శిఖరాలతోనూ పైకి లేచి వచ్చినాడు. అంతవరకూ నీళ్లలో మునిగిఉన్న మైనాకుడు సముద్రుడు చెప్పినందువల్ల పైకి పెరిగి బంగారు శిఖరాలతో ఆకాశాన్ని అంటే ఉదయ సూర్యకాంతులతో తేజరిల్లుతూ ఉంటే నల్లగా కనిపించే ఆకాశము అప్పుడు బంగారు కాంతులతో దేదీప్యమానముగా అగుపించింది. బంగారుమయము అయిన మైనాక పర్వతశిఖరాలు అట్లా మహాప్రభలతో తేజరిల్లుతూ ఉంటే నూరు మంది సూర్యులు ఉదయించినట్టుగా అప్పుడు ఆకాశము కనిపించింది.

ఏ అడ్డమూ లేకుండా అట్లా పైకి లేచిన ఆ మైనాకపర్వతాన్ని హనుమంతుడు చూచినాడు. తనకు సముద్రమధ్యములో విఘ్నము ఒకటి వచ్చింది అనుకొన్నాడు. అట్లా ఆకాశము అంత ఎత్తున పైకి లేచిన ఆ మైనాక పర్వతాన్ని వాయువేగము మేఘాలను కిందకు పడతోసేట్టు ఆ మహావేగవంతుడు హనుమంతుడు తన ఎదురు రొమ్ములతో పడతోసినాడు. అంత వేగముతో వచ్చి హనుమంతుడు అట్లా తనను పడతోసినందుకు మైనాకుడికి ఒండ్లు పులకలు ఎత్తింది. అప్పుడు మైనాకుడు మనుష్యరూపము ధరించి తన పర్వతశిఖరము మీద నిలుచుని ఆ కపిశ్రేష్ఠుణ్ణి హనుమంతుణ్ణి చూచి "ఓ వానరోత్తమా, నీవు దుష్కరము అయిన కార్యము తలపెట్టినావు. నా శిఖరాలమీద వాలి కొంతసేపు అలుపు తీర్చుకో. ఆ తరువాత సుఖముగా పో.

"ఓ హనుమంతుడా, ఈ సముద్రుణ్ణి పూర్వము సగరచక్రవర్తి పుత్రులు అభివృద్ధి చేసినారు. రాముడు ఆ సగరచక్రవర్తి వంశీయుడు. అందువల్ల ఈ సముద్రుడు ఆ రాముడికి మేలు చేయడానికి నిన్ను పూజింప తలచుకొన్నాడు. ఉపకారికి ప్రత్యుపకారము చేయడము సనాతన ధర్మము. రాముడికి సాయము చేస్తూ ఉన్న నిన్ను పూజించి ఈ సముద్రుడు తనకు ఉపకారము చేసిన సాగరుల వంశములో పుట్టిన రాముడికి ప్రత్యుపకారము చేసినవాడు కాతలచుకొన్నాడు. కృతజ్ఞుడు అయిన ఈ సముద్రుడు నాతో "మైనాకుడా, ఈ హనుమంతుడు నూరు యోజనాల సముద్రాన్ని దాటిపోవలెను. ఈతడు నీ పెట్లాలలో అలుపు తీర్చుకొనేటట్లయితే ఇక్కడినుంచి మిగతా దారి సులభముగా దాటిపోతాడు. నీవు పయికి లేవవలెను" అని చెప్పి నిన్ను గౌరవించడానికి నన్ను ప్రోత్సహించినాడు. అందువల్ల నీవు నామీద విశ్రమించు. ఇక్కడ ఉన్న రుచ్యము అయిన కందమూల ఫలాలను ఆరగించు. అలుపు తీర్చుకో. ఆ తరువాత పో.

"ఓ హనుమంతుడా, నీకూ నాకూ చాలా గొప్ప సంబంధము ఉంది. నీవు రామదూతవు అయినందువల్ల ఈ సముద్రుడు నన్ను తనకు సాయపడమని ప్రోత్సహించడము ఒక సంబంధము. నీ తండ్రి వాయుదేవుడు పూర్వము నాకు సాయపడడము మరి ఒక సంబంధము. ఇప్పుడు నీవు ఈ దారిన వస్తూ ఉన్నావు. కనుక నీవు నా అతిథివి. ఇది ఒక సంబంధము. అతిథ్యతిథిమద్యాభవసంబంధము ముల్లోకాలలోనూ ప్రసిద్ధము అయింది. దానిని మహాగుణవంతులు అంగీకరించినారు.

"ఓ వాయుపుత్రుడా, నీవు కపికుంజరుడవు. అమితవేగముతో ఎగిరి పోయే వానరులలో నిన్ను మించినవాడు మరి ఒకడు లేడు అనుకొంటున్నాను. ధర్మజ్ఞులకు ధర్మజిజ్ఞాసువులకూ అతిథి ప్రాకృతుడు అయినప్పటికిన్నీ పూజార్హుడు. నీవంటి గొప్పవాడితో నీవు పూజార్హుడవు అని చెప్పవలసిన పనే లేదు.

"ఓ హనుమంతుడా, నీవు దేవతలలో శ్రేష్ఠుడు గొప్పవాడూ అయిన వాయుదేవుడి పుత్రుడవు. వేగానికి నీవు నీ తండ్రితో సరిసమానము అయిన వాడవు. నీవు ధర్మజ్ఞుడవు. నీకు తెలియంది ఏమీ లేదు. నిన్ను పూజించడము అంటే నీ తండ్రిని పూజించడమే అవుతుంది. అందువల్ల నీవు నాకు పూజనీయుడవు. నీ తండ్రి వాయుదేవుడు నాకు ఎందుకు పూజనీయుడో చెప్పుతాను. విను.

"వాయుసా, హనుమంతుడా, పూర్వము కృతయుగములో పర్వతాలకు పక్షులకు వలెనే రెక్కలు ఉండేవి. అవి ఆ కాలములో గరుత్మంతుడి వలెనూ వాయుదేవుడి వలెనూ అన్ని దిక్కులకూ ఎగిరిపోతూ ఉండేవి. ఆ పర్వతాలు అట్లా ఎగిరి ఎక్కడికి పడితే అక్కడికి పోతూ ఉంటే దేవతలూ మహర్షులూ మొదలు అయిన వారు అవి తమమీద ఎక్కడ పడిపోతవేమోనని భయశంకితులు అయినారు. సహస్రాక్షుడు దేవేంద్రుడు అప్పుడు క్రుద్ధుడు అయిపోయి వజ్రాయుధముతో ఆ పర్వతాల రెక్కలను అక్కడ అక్కడ ముక్కలు ముక్కలుగా నరికివేసినాడు. అప్పుడు ఆ దేవరాజు కోపముతో నా రెక్కలు నరికివేయడానికి నా మీదికి వచ్చినాడు. నాకు ఆ సమయాన వాయుదేవుడు సాయపడ్డాడు. ఓ హనుమంతుడా, నీ తండ్రి వాయుదేవుడు నాకు ఇచ్చిన ఊపుకు నేను ఈ సముద్రములో గబుక్కున చొరపడ్డాను. నా రెక్కలు పోలేదు. చెక్కు చెదరకుండా ఉన్నాను, నీ తండ్రి వాయుదేవుడు నన్ను అట్లా కాపాడినాడు. అందువల్ల ఆయన నాకు పూజనీయుడు. ఆయనకుంచి నీవు నాకు పూజనీయుడవు. ఈ మన సంబంధము చాలా గొప్పది. ఓ మహాకపీ, నా పూజను నీవు సంతోషముగా అంగీకరించు. నేను సంతోషిస్తాను. ఈ సముద్రుడు సంతోషిస్తాడు. ఓ కపిసత్తమా, నా మీదను నీవు నిలువు, నీ మార్గాయాసము తీర్చుకో, నా స్నేహాన్ని సన్మానించు, నీ దర్శనము చేయడమువల్ల నాకు ఇప్పుడు ఎంతో సంతోషముగా ఉంది" అని చెప్పినాడు.

ఇట్లా మైనాకుడు చెప్పింది విని హనుమంతుడు "ఓ మైనాకుడా, నీవు చెప్పింది విన్నాను, నేను నిన్ను మెచ్చుకొంటున్నాను, నీవు నాకు అతిథి సత్కారము చేసినట్టే భావిస్తున్నాను. నీకు కోపమువద్దు. ఇది నేను నా పని మీద పోతున్న సమయము. నేను ఇప్పుడు త్వరగా పోవలెను. ఈ సముద్రమధ్యములో నేను నిలువకూడదు. పొద్దు వాలిపోతూ ఉంది. మధ్యను ఎక్కడా ఆగకుండా రామబాణమువలె పోతాను అని నేను వానరులతో శపథము చేసినాను" అని నవ్వుతూ చెప్పినాడు. అంతట ఆ వీర్యవంతుడు హనుమంతుడు ఆ మైనాకుణ్ణి చేతితో తాకినాడు. అప్పుడు ఆ మైనాకుడూ సముద్రుడూ ఆ వాయుపుత్రుణ్ణి హనుమంతుణ్ణి గౌరవముతో చూస్తూ రామకార్యము నెరవేరవలెను అని ఆశీర్వదించినారు. వారి సత్కారాలనూ ఆ విధముగా అందుకొని హనుమంతుడు ఆ మైనాకుణ్ణీ ఆ సముద్రుణ్ణీ వదలిపెట్టి వాయుమార్గాన ఎగిరి పోయినాడు.

అప్పుడు దేవతలూ సిద్ధులూ పరమర్షులూ హనుమంతుడు చేసిన ఆ రెండవ దుర్ఘటకార్యాన్ని ప్రశంసించినారు. (మొదటి దుర్ఘటకార్యము సముద్రలంఘనము. రెండవ దుర్ఘటకార్యము మైనాక పర్వతముమీద విశ్రమించకుండా పోవడము).

ఆ బంగారు మైనాకుడు చేసిన పనికి దేవతలు అందరూ సంతుష్టులు అయినారు. సహస్రాక్షుడున్నూ సంతోషించినాడు. ఆ ధీమంతుడు దేవేంద్రుడు అప్పుడు మైనాకుణ్ణి చూచి గద్గదస్వరముతో "ఓ హిరణ్యనాభా, నీవు శైలేంద్రుడవు. నీవు చేసిన పనికి నేను సంతుష్టుణ్ణి అయినాను. నీవు మంచివాడవు. నేను నీకు అభయము ఇస్తున్నాను. నీవు సుఖముగా ఉండు. నిర్భయముగా ఉండు. నిన్ను నేను ఏమీ చేయను. నూరు యోజనాల సముద్రము దాటి పోతూ ఉన్న హనుమంతుడికి సాయము చేయడానికి పైకి లేచినావు. అది చాలా గొప్ప పని. హనుమంతుడు రామదూత. నీవు అతనిని సత్కరించినావు. నాకు చాలా సంతోషము అయింది" అని చెప్పినాడు.

ఇట్లా ఇంద్రుడు వరము ఇచ్చినందువల్ల మైనాకుడు తన పర్వతాకారముతో అక్కడ ఆ సముద్రములో నిలచిపోయినాడు.

హనుమంతుడున్నూ ఒక్క ముహూర్తములో ఆ ప్రదేశము దాటి అవతలకు పోయినాడు.

అంతట దేవతలూ గంధర్వులూ సిద్ధులూ పరమర్షులూ సూర్యకాంతులతో తేజరిల్లే నాగమాతను చూచి "ఓ సురసా, ఈ కాంతిమంతుడు వాయుపుత్రుడు హనుమంతుడు. ఈ సముద్రముమీద ఇప్పుడు ఎగిరిపోతున్నాడు. నీవు ఈతని గమనాన్ని ఒక ముహూర్తము సేపు విఘ్నము చేయవలెను. నీవు పర్వతము అంత ఎత్తున భయంకరము అయిన రాక్షసి రూపము ధరించి పెద్ద పెద్ద కోరలతో పెద్ద నోటితో తేనె రంగు కన్నులతో ఆకాశము అంత ముఖముతో నిలుచుండవలెను. మేము ఈతని బలమూ పరాక్రమమూ మళ్ళీ ఇప్పుడు తెలుసుకోవలెను అనుకొంటున్నాము. ఇతడు ఏది అయినా ఉపాయముతో నిన్ను జయిస్తాడో లేక ఓడిపోయి దుఃఖపడుతాడో మేము చూస్తాము" అని చెప్పినారు.

దేవతలు ఈ విధముగా చెప్పి సన్మానించినందువల్ల ఆ సురసాదేవి ఆ సముద్రములో చేతులూ కాళ్లూ లేకుండా వికృతమూ భయావహమూ అయిన రాక్షసాకారముతో హనుమంతుణ్ణి కమ్ముకొని "ఓ హనుమంతుడా, నిన్ను దేవతలు నాకు ఆహారముగా చూపించినారు. నేను నిన్ను భక్షిస్తాను. ఇదిగో నోరు తెరిచినాను. లోపల చొరబడు" అన్నది.

ఇట్లా అన్న ఆ సురసాదేవిని చూచి ఆ కాంతిమంతుడు హనుమంతుడు చేతులు జోడించి ముఖాన సంతోషము ఉట్టిపడుతూ "ఓ సురసా, దశరథమహారాజు కొడుకు రాముడు పితృఆజ్ఞాపరిపాలనము కోసము తమ్ముడు అయిన లక్ష్మణుడితోనూ భార్య వైదేహితోనూ దండకారణ్యానికివచ్చినాడు. అతనికి రాక్షసులతో బద్ధవైరము వచ్చింది. ఆరాముడు అన్యకార్యాసక్తుడు అయిఉండగా అతని భార్య యశస్విని సీతాదేవిని రావణాసురుడు ఎత్తుకొని పోయినాడు. నేను ఆ రాముడి దూతను. రామాజ్ఞనుంచి నేను ఇప్పుడు ఆసీతాదేవి దగ్గరకుపోతున్నాను. నీవు నివసిస్తున్నది ఆరాముడి దేశము. అందువల్ల నీవు ఆరాముడికి సహాయము చేయవలెను. అట్లా కాదు అనేటట్లయితే నేను ఆమైథిలిని ఎటువంటి కష్టకార్యాన్ని అయినా ఇట్టే చేసివేసి ఆరాముణ్ణి చూచి వచ్చి నీనోటిలో పడుతాను. నీకు సత్యముగా చెప్పుతున్నాను. నామాట నమ్ము" అన్నాడు.

ఆ కామరూపిణి సురసాదేవి హనుమంతుడితో "ఎవరున్నూ ఇక్కడ నన్ను మీరి పోవడానికి వీలు లేదు. నాకు అట్లా బ్రహ్మదేవుడు వరము ఇచ్చినాడు. ఇప్పుడే నీవు నానోటిలో పడవలెను" అంటూ పెద్ద నోరు తెరిచింది.

హనుమంతుడికి కోపము వచ్చి "ఓసురసా, నన్ను మింగడానికి వీలు అయ్యేట్టు నోరు తెరువు" అంటూ పదియోజనాల వెడల్పుగా తన కాయాన్ని పెంచినాడు. సురస అంతట ఇరవై యోజనాల వెడల్పున నోరు తెరిచింది. ఈవిధముగా ఒకరితో ఒకరు పోటీపడ్డారు. హనుమంతుడు దేహాన్ని తొంభైయోజనాల వెడల్పున పెంచినాడు. సురస నూరుయోజనాల వెడల్పున నోరు తెరిచింది. మహాఘోరనరకమువంటి పొడుగాటి నాలుక చాచింది. అది చూచి ఆబుద్ధిమంతుడు హనుమంతుడు అంగుష్ఠమాత్రుడు అయి ఇట్టే ఆసురస నోటిలోకి పోయి అది నోరు మూసే లోపలనే ప్రుటక్కున బయటికివచ్చి ఎగిరి ఆకాశములోకి పోయి ఆ సురసను చూచి— "ఓదాక్షాయణీ నీవు కోరినట్టు నీనోటిలో పడ్డాను. నీకు బ్రహ్మదేవుడు ఇచ్చిన వరము సఫలము అయింది. నమస్కారము చేస్తున్నాను" అని చెప్పినాడు.

అప్పుడు సురస తన నిజరూపము ధరించి "ఓహనుమంతుడా, నీ కార్యము సాధించడానికి సుఖముగా పో. రాముడితో వైదేహిని చేర్చు" అని చెప్పింది.

హనుమంతుడు చేసిన ఈ మూడవ దుర్ఘటకృత్యానికి సర్వభూతాలూ మెచ్చుకొన్నవి. దాట నలవికాని ఆవరుణాలయము అయిన సముద్రాన్ని దాటడానికి గరుత్మంతుడి వలె హనుమంతుడు ఆకాశమార్గము పట్టినాడు. ఆ ఆకాశము వర్ష ధారలు కార్చే మేఘాలకు ఉనికిపట్టు. అదే పక్షులు ఎగిరిపోయే దారి. అదే కైశికాదిరాగ ప్రవర్తకులు (దేవగాయకులు) అయిన తుంబురుడూ నారదుడూ మొదలు అయిన వారి సంచార మార్గము. వంకరగా పొడుగుగా ఉండే ఇంద్రధనుస్సు వ్యాపించేది అక్కడనే. సింహ గజశార్దూల పన్నగాలను వాహనాలుగా ఎక్కిపోయే వారికీ అటూ ఇటూ పరుగెత్తే విమానాలకూ అదే దారి. వజ్రాయుధమూ పిడుగూ వీటి దెబ్బల వల్ల పుట్టే నలభైతొమ్మిది వహ్నులకు అదే స్థానము. పుణ్యము చేసి స్వర్గాన్ని జయించిన మహాభాగులు ఉండేది ఆ తావుననే. హోమద్రవ్యాన్ని మోసుకొని పోయే చిత్రభానుడి నాకవాహకులకు అదే దారి. అశ్విన్యాదినక్షత్రాలు అలంకారముగా కనపడుతూ ఉంటే బుధాదిగ్రహాలూ సూర్యచంద్రులూ సంచారము చేసే దారి అదే. మహర్షులూ యక్షులూ నాగులూ గంధర్వులూ తిరిగేదిన్నీ అక్కడనే. అది వివిక్తముగా ఉంటుంది. నిర్మలముగా ఉంది. అది ఈ ప్రపంచాన్ని అంతా వ్యాపించింది. విశ్వావసుడు అనే గంధర్వరాజు ఉండేది అక్కడనే. దేవేంద్రుడి ఐరావతము అనే దిగ్గజము తిరిగేది అక్కడనే. దానిని బ్రహ్మదేవుడు ప్రాణికోటికి పెద్ద విశాలము అయిన చాందినిగా నిర్మించినాడు. పరాక్రమవంతులూ శ్రేష్ఠులూ అయిన విద్యాధరులు విహరించేది అక్కడనే. పట్టులేని ఆ దారిన రెక్కలు ఉన్న పర్వతరాజు వలె వాయుపుత్రుడు హనుమంతుడు అందరికీ కనపడేట్టు పోతున్నాడు.

అట్లా సముద్రాన్ని దాటి పోతూఉన్న ఆ హనుమంతుణ్ణి సింహిక అనే రాక్షసి చూచింది. అది కామరూపిణి. ఆలోచించింది. దేహాన్ని పెంచింది. "బహుకాలానికి ఇప్పుడు భోజనము చేయబోతున్నాను. ఇంత పెద్ద జంతువు చిరకాలానికి నాకు చిక్కింది" అని మనస్సులో అనుకొని ఆ హనుమంతుడి నీడను పట్టుకొన్నది. ఆ సింహిక తన నీడను పట్టుకోగానే సముద్రములో ఎదురుగాలికి తల్లడిల్లే ఓడవలె వేగము కుంటుపడిపోయి హఠాత్తుగా తాను పట్టుపడ్డట్టు హనుమంతుడు భావించినాడు. పైకీ కిందికీ పక్కలకూ చూచినాడు. సముద్రములో లేచిన అమహాసత్వము కనిపించింది. వికృతాననముతో అది మహాద్భుతముగా తోచింది. అదివరకు తనతో సుగ్రీవుడు చెప్పిన ఛాయాగ్రాహి అనే జంతువు అదేను అనుకొన్నాడు. సందేహించ లేదు. అప్పుడు ఆ మతిమంతుడు హనుమంతుడు ఆయాగుర్తులను పట్టి అది నిశ్చయముగా సింహికను అని తెలుసుకొని వర్షాకాలమేఘము వలె మహాకాయుడు అయినాడు. అట్లా పెరిగిపోయిన ఆ హనుమంతుణ్ణి ఆ సింహిక చూచింది. మేఘాలవలె గర్జిస్తూ పాతాళద్వారము వలె నోరు తెరిచి హనుమంతుడి మీదికి పరుగెత్తింది. తనను మ్రింగివేయడానికి వీలు అయ్యేట్లు నోరు తెరిచిన సింహిక ఆయువుపట్టును ఆమేధావి హనుమంతుడు చూచినాడు. అంతట ఆ మహాబలవంతుడు ఆ వజ్రసమానదేహుడు హనుమంతుడు తన దేహాన్ని కురచచేసినాడు. ఆ సింహిక తెరిచిన నోట పడిపోయినాడు. అట్లా దానినోటిలో పడుతూ ఉన్న హనుమంతుడు పర్వకాలాన రాహువు నోటిలోకి పోయే పూర్ణచంద్రుడి వలె కనిపించినాడు. మనోవేగముతో నూతనముగా పోయే ఆ పరాక్రమవంతుడు హనుమంతుడు అప్పుడు ఆ సింహిక ఆయువుపట్టును తన వాడి అయినగోళ్లతో చీల్చి వేసి (అది నోరుమూసుకొనేలోపలనే) దాని నోటిలో నుంచి బయటికి ఎగిరినాడు. ఆ ప్రశస్తదేహుడు ఆ ధైర్యవంతుడు ఆపరమసమర్థుడు హనుమంతుడు అంతట దానిని పడతోసి వెంటనే మళ్ళీ దేహాన్ని పెంచినాడు. ఆసింహిక గుండె బ్రద్దలు అయి ఆ సముద్రములో పడి చచ్చిపోయింది.

అది చూచి సిద్ధచారణ గంధర్వాదులు ఆకాశము నుంచి హనుమంతుణ్ణి ఉద్దేశించి "ఓ హనుమంతుడా, ఎగిరిపోయే వాండ్లలో నీవు శ్రేష్ఠుడవు. నీవు ఇప్పుడు మహాభయంకరము అయిన పని చేసినావు. గొప్పరాక్షసిని చంపివేసినావు. మంగళకరము అయిన నీఅభీష్టకార్యాన్ని ఇక సాధించు. హనుమంతుడా, ధైర్యమూ దూరదృష్టీ మేధస్సూ కార్యసాధనసామర్థ్యమూ నీకు ఉన్నట్టు ఎవడికి ఉంటవో వాడి పనులు ఏవీ చెడవు" అని చెప్పినారు.

అట్లా సిద్ధచారణాదుల సమ్మానవాక్యాలు వింటూ ఆపూజనీయుడు హనుమంతుడు తన ప్రయోజనము సాధించడానికి ఆకాశములో గరుత్మంతుడి వలె పోయినాడు.

ఆ సముద్రములో నూరు యోజనాల అవతల ఉన్న గట్టు దగ్గర దగ్గరగా హనుమంతుడికి కనిపించింది. ఆగట్టు పారచూచినాడు. తీరములో ఉన్న అడవులు కనిపించినవి. నానావిధవృక్షాలతో ఉన్న ఆద్వీపాన్నీ అక్కడ మలయపర్వతము మీద ఉన్న ఉద్యానవనాలనూ కిందికి రాకుండానే చూచినాడు.

ఆ ధైర్యవంతుడు ఆమతిమంతుడు హనుమంతుడు అంతట ఆ సముద్రాన్నీ, ఆ సముద్ర తీరాన తడి నేలనూ అక్కడ పెరుగుతూ ఉన్న చెట్లనూ ఆసముద్రములోకి వచ్చి పడుతూ ఉన్న నదులనూ ఆనదులు పుట్టిన కొండలనూ చూచినాడు. ఆకాశములో ఎగిరి వస్తూ ఉన్న మహామేఘ సమానము అయిన తన రూపాన్ని గురించి యోజించినాడు.

"రాక్షసులు నా వేగాన్నీ నా ఈ మహాకాయాన్ని చూచేటట్లయితే నేను ఎవడినో తెలుసుకోవలెను అని కుతూహల పడుతారు" అనుకొన్నాడు. కొండ అంత ఆదేహాన్ని కుదించినాడు. అజ్ఞానము వదిలి పోయిన ఆత్మజ్ఞాని వలె స్వస్వరూపము ధరించినాడు. విశ్వరూపముతో మూడు అడుగులు వేయడానికి బలిచక్రవర్తి పరాక్రమాన్ని హరించి వేసిన మహావిష్ణువు వామనుడు అయినట్టు హనుమంతుడు తన మహాదాకారాన్ని వదలి పెట్టి ఎప్పటిమాదిరిగా అయిపోయినాడు.

నానావిధరూపాలూ ధరించి ఇతరులకు అశక్యము అయిన పనులు చేసిన ఆ హనుమంతుడు తన నిజరూపముతో ఆసముద్ర తీరము చేరి తన శరీరము చూచుకొన్నాడు. తాను చేయవలసిన పనిని గురించి ఆలోచించుకొన్నాడు. మహాపర్వతశిఖరము వంటి ఆధైర్యవంతుడు మొగలిపొదలతోనూ విరిగి చేవ చెట్లతోనూ కొబ్బరి చెట్లతోనూ నానావిధ వృక్షాలతోనూ విచిత్రశిఖరాలతోనూ ఉన్న లంబపర్వతశిఖరముమీదికి ఎగిరినాడు. ఒండ్లు విదిలించినాడు. అక్కడి పక్షులనూ మృగాలనూ బెదరించినాడు. అక్కడ నుంచి త్రికూట పర్వతముమీద ఉన్న లంకాపట్టణాన్ని చూచినాడు. అది దేవేంద్రుడి అమరావతీపట్టణము వలె తోచింది.

# సహకారోద్యమము

## శ్రీ నరసింహదేవర సత్యనారాయణ

సహకారోద్యమము భారతదేశములో బ్రిటిషు ప్రభుత్వమువారు ప్రవేశ పెట్టి అర్ధశతాబ్దము గతించినది. 1905 సంవత్సరంలో సహకార చట్టము కేంద్ర ప్రభుత్వమువారు దేశమున కంతటను వర్తించునట్లు శాసనము కావించిరి. రైతులకు పరపతి సకాలములో అందజేసి వ్యవసాయ పెట్టుబడికి కావలసిన డబ్బుయిచ్చుటకొరకే ప్రాథమిక సహకారపరపతి సంఘములు నెలకొల్పిరి. 1912 సంవత్సరంలో తిరిగి కేంద్ర ప్రభుత్వమువారు శాసనము సవరించి ప్రాథమిక సహకారసంఘములకు డబ్బు సరఫరా చేయుటకు కేంద్ర సహకార బ్యాంకులను నెలకొల్పుటకును, సంఘములు తనిఖీ చేయుటకు యూనియనులు నెలకొల్పుటకును సహకారశాసనము సవరణ చేసిరి. సహకార గ్రామసంఘములకు తగిన ధన స్తోమతు లేకపోవుటచే జిల్లా సహకార బ్యాంకులు సహకార కేంద్ర బ్యాంకులకు ధనము సరఫరా చేయుటకు రాష్ట్రీయ సహకార బ్యాంకులు యీ శాసనము మూలమున స్థాపింపబడినవి. ఈ సంస్థలు వేటికవి స్వతంత్రములే యైనను ఒకదానికొకటి అనుబంధముగ చేర్చుటకు నిబంధనలు యేర్పాటు చేయబడినవి. సహకారసంఘ ప్రతినిధులు కూడి సెంట్రలు బ్యాంకులను యేర్పాటు చేసిరి. సెంట్రలు బ్యాంకుల ప్రతినిధులతో రాష్ట్రీయబ్యాంకులు యేర్పడినవి. సహకారసంఘములు సభ్యులుగ నుండుటయే గాక సహకార ఉద్యమాభిమానులు కూడ వ్యక్తిసభ్యులుగా యీ సంస్థలలో చేరవచ్చును. ఉద్యమ పురోభివృద్ధికి తోడ్పడవచ్చును. సెంట్రలుబ్యాంకులు రాష్ట్రీయ బ్యాంకులు యిట్టి వ్యక్తుల సభ్యులలోను, సంఘ ప్రతినిధులనుకూడి పాలకవర్గమును ఎన్నుకొనెదరు. పాలకవర్గము కార్యనిర్వాహకవర్గమును, అధ్యక్షు, ఉపాధ్యక్షు, కోశాధిపతులను ఎన్నుకొనెదరు. గ్రామ సహకార సంస్థలు మొదలు రాష్ట్ర సహకారసంస్థల వరకు యీ ఉద్యమము డిమోక్రటిక్ పద్ధతిని అనగా ప్రజాప్రాతినిధ్యము కలిగి నిర్వహింప బడుచున్నది. వయోజను లెల్లరు కుల మత రాజకీయ పార్టీలతో సంబంధము లేకుండగ 18 సం॥రములు దాటిన వారెల్లరు యిందు సభ్యులుగ చేరవచ్చును. 18 సంవత్సరములుదాటిన ప్రతివ్యక్తియు స్త్రీలైనను, పురుషులైనను, యిందు సభ్యులుగ చేరవచ్చును. అయితే జాయింటుస్టాకు కంపెనీలవలెనె గాక యిందు ఓటుహక్కు తాము చెల్లించు షేరు ధనముతో సంబంధము లేకుండ, ప్రతి ఒక్కరికి యెన్ని షేర్లు కలిగి యున్నను, ప్రతి సభ్యునకును ఒక్కటే ఓటు. గ్రామ సహకారసంఘములు పరిమితిలేని పద్ధతి పూచీని ఉద్యమ ప్రారంభమునుండియు నెలకొల్పబడుచున్నవి పట్టణ కేంద్ర సహకార సంఘములు పరిమితిగల పూచీసయిని, స్థాపింపబడుచున్నవి. ఇది సహకారోద్యమ సంస్థల నిర్మాణము. Federal Structure అంటే అంతస్థుల పై అంతస్థులు గ్రామ సహకార సంఘములు పునాది పై నిర్మాణము చేయబడినవి. గ్రామ సహకారములకు సెంట్రలు బ్యాంకులు ధనము సరఫరాచేయును. సెంట్రలు బ్యాంకులకు అవసరము వెంబడిని రాష్ట్రీయ బ్యాంకులు వారు ధనము సరఫరా చేయుచుండును. సెంట్రలు బ్యాంకులు, రాష్ట్రీయ బ్యాంకులు, నేరుగా సభ్యులకు అప్పులీయకూడదు. సంఘముల ద్వారానే సభ్యులక్కు అప్పులు బట్వాడా కావలయును.

1919 సం॥ రంలో సహకారోద్యమము కేంద్రప్రభుత్వ పరిపాలన నుంచి రాష్ట్ర ప్రభుత్వ పరిపాలనకు సంక్రమింప చేయబడినది. 1919 సం॥రంలో రాష్ట్రములలోద్వంద్వ పరిపాలనా పద్ధతి నెలకొల్పబడినది. సహకారోద్యమము రాష్ట్రీయ మంత్రుల పరము చేయబడినది. 1919 సం॥రం వరకు సహకారోద్యమము చాల నెమ్మదిగా త్వరితగతిని పురోభివృద్ధి కాలేదు. హైందవ మంత్రుల అధీనము ఉద్యమము చేయబడినప్పటినుంచి సహకార సంస్థలు త్వరితగతిని దేశములో వ్యాప్తిచేయబడినవి. వేలకొలది సహకారసంఘములు దేశములో నెలకొల్పబడినవి. ప్రథమ ఐరోపా యుద్ధానంతరము ధర వరలు హెచ్చినవి. భూమి ధరలు పెరిగినవి. రైతుల ఆదాయము వృద్ధి పొందినది. ఈ ధనవ్యాప్తి యెల్లప్పుడు యేపు చూపునని రైతులు భూస్వాములు, సహకార సంఘములలోచేరి అమితముగ డబ్బు వాడజొచ్చిరి. ఇందుచే సంఘములలో ధన వ్యాపారము వృద్ధి పొందినది. కాని యీ ధన వ్యాప్తి 1930 సం॥ రం నుంచి ప్రపంచములో కలిగిన ఆర్థిక మాంద్యము చే ధరవరలు పడిపోయినవి. పంట దినుసులు అమ్మకము లేక నిలిచి పోయినవి. భూమి ధరలు తగ్గిపోయినవి. దేశమంతట ధన వ్యాప్తి తగ్గినది. హెచ్చు క్రయము పెట్టుకొన్న భూముల అసాములు ఋణముల పాలై తక్కువ ధరలకు భూములు అమ్ముకొనవలసి వచ్చినది. సహకార సంఘములలో అప్పులు తీసిన రైతులు వాయిదాలు చెల్లించుకోలేక భూములు అమ్ముకొనవలసి వచ్చినది. సంఘములలో వ్యాపారము స్తంభించినది. దావాలు చేయవలసి వచ్చినది. డిక్రీలు అమలు జరుపవలసివచ్చినది. కొన్ని గ్రామ సంఘముల రద్దు చేయవలసి వచ్చినది. పరపతిలేని పూచీ అమలులో పెట్టవలసి వచ్చినది. యెక్కడచూచినా భీభత్సము బయలు దేరినది. ప్రభుత్వము మారిటోరియము ప్రకటింపవలసి వచ్చినది. ఈ ఆర్థిక మాంద్యము రోజులలో సహకారోద్యమము చాల దెబ్బ తినినది. కాని ననువెంటనే 2 వ ఐరోపా సంగ్రామము ప్రారంభముగుటచే తిరిగి ధరవరలు పెరిగినవి. భూమి ధరలు హెచ్చినవి. రైతునకు చేతినిండా పుష్కలముగ ధనము పంటదినుసుల అమ్మకము వలనరాజొచ్చినది. పాత బకాయీలు తీరినవి. తిరిగి సహకారోద్యమము ప్రవర్ధమానమై వివిధ మార్గముల వ్యాప్తి కాజొచ్చినది. 2 వ ఐరోపా సంగ్రామమువలన కంట్రోళ్లు అన్ని వస్తువులకు అమలులోనికి వచ్చినవి. ప్రభుత్వమువారు సహకార సంఘములను ప్రోత్సహించి కంట్రోళ్ళ సరుకులను వీటద్వారా అమ్మకము జరిపించుటచే నూతన సహకార సంస్థలు నెలకొల్పబడవలసి వచ్చినది. పరపతేతర వ్యాపారము వృద్ధికాజొచ్చినది. గ్రామ పరపతి సంఘముల కంటె పరపతేతర సహకార సంఘములు ప్రభుత్వము వారు యెక్కువ దోహదము చేసిరి. అందుచే ప్రాథమిక సహకార స్టోర్సు అంగడులు కేంద్ర సహకార స్టోర్సు మార్కెటింగు సహకార సంఘములు యెన్నియోఅంతర్వులమీద అంతర్వులు సృష్టింపవలసి వచ్చినది. ఈ సంఘములకు సెంట్రలు బ్యాంకులు రాష్ట్రీయబ్యాంకులవారు హెచ్చు ధనమును సరఫరా చేసిరి. పరపతి వ్యాపారము కంటే నేడు దేశములో పరపతేతర వ్యాపారమే హెచ్చయినది. సహకార పరపతి సంఘములు కూడ కేవలము వడ్డీ వ్యాపారసంఘములే కాకుండగ సకలార్థ సహకారసంఘములుగ మార్చవలసి వచ్చినది. ఎరువులు, వ్యవసాయ పనిముట్లు రైతులకు కావలసిన యితర వస్తు సముదాయము సంతయు సహకార సంఘముల ద్వారా పరపతేతర వ్యాపారము వృద్ధి అయినది. పరపతేతర వ్యాపారమే కాకుండగ మార్కెటింగు సహకార సంస్థలు, ఉత్పత్తి సహకార సంస్థలు, పారిశ్రామిక సహకార సంస్థలు, గృహపరిశ్రమ సహకార సంస్థలు, పాల సహకార సంఘములు, ఇండ్ల సహకారసంఘములు, పశు ఉత్పత్తి సహకార సంఘములు, చేపల సరఫరా సహకార సంఘములు, వివిధ సహకార సంఘములు, పరిపరి విధముల వ్యాప్తి చేయబడినవి. ఇందు మూలమున సెంట్రలు బ్యాంకులలోను, రాష్ట్రీయ బ్యాంకులలోను, ధనవ్యాపారమువృద్ధియై వివిధ రకముల సహకార సంఘములకు డబ్బు సరఫరా చేయుటకు తగిన ధనస్తోమతు లేకపోయినది. అందుచే ప్రభుత్వమువారు రిజర్వుబ్యాంకు ద్వారా రాష్ట్రీయ సహకార సంఘములకు తక్కువ వడ్డీకి రాష్ట్ర ప్రభుత్వముల హామీమీద కోట్లకొలది రూపాయిల ధనము సరఫరా చేయుచున్నారు.

దేశమునకు స్వాతంత్ర్యము లభించిన తరువాత ప్రభుత్వమువారు గ్రామోద్ధరణకు వ్యవసాయ పురోభివృద్ధికి వస్తూత్పత్తికి విశేషధనము హెచ్చించుచున్నారు ఈ కార్యప్రణాళిక లన్నిటిని అమలులో పెట్టుటకు సహకార సంఘములకు దోహద మొసగుచున్నారు. పంచవర్ష ప్రణాళికలలో సహకార సంఘములకు పరపతినిచ్చుటకు స్వల్ప వాయిదా అప్పులు రైతునకు పెట్టుబడి నిచ్చుటకు నూరుకోట్ల రూపాయలు రిజర్వు బ్యాంకు ద్వారా నిచ్చుటకు యేర్పాటుచేసిరి. మధ్యవాయిదా అప్పు లిచ్చుటకు 25 కోట్ల రూపాయలు మంజూరుచేసిరి. దీర్ఘ వాయిదా అప్పులు 5 కోట్ల రూపాయలు మంజూరుచేసిరి. ఏటేటా వెచ్చించుటకు ప్రభుత్వము నిశ్చయించిరి.

ఈ ధన ప్రవాహమునంతయు సహకారసంస్థలు సద్వినియోగముపరచుకొని రైతుల అందుబాటులో చేసుకొనవలసి వచ్చినది. అయితే ప్రస్తుతము గ్రామ పరపతిసంఘములు తగినంత బలిష్టముగ లేవు. తీరువుకొళ్లవలె సన్నగిల్లి పోయినవి. తలబరువై కృంగిపోవుచున్నవి. కంట్రోళ్లు తీసివేయడముతో సహకారస్టోర్సు నీరుకారుచున్నవి. మార్కెటింగు సంఘములు వర్తకులకు పోటీలకు నిలువలేకున్నవి. ఈ ధన ప్రవాహము గ్రామసభ్యులకు చేరవలెనంటే సహకారసంఘ నిర్మాణములో మార్పు కావలయును. ప్రభుత్వమువారు 100 కి 51 వంతు షేరుధనమును సరఫరా చేయుటకు నిశ్చయించిరి. తమ ప్రాతినిధ్యము సహకారసంఘములో తమ ధన సంరక్షణకొరకు కావలయునని నిశ్చయించిరి. అయితే గ్రామసంఘముల నిర్మాణము తగినంత బలిష్టముగ చేసినగాని పైనుంచి యెంత ధనప్రవాహము పొంగి పొరలి వచ్చినను దళారులలో యింకి పోవచ్చును. వృత్తిమూల స్కంధములకు చేరదు. సహకారోద్యమము కావలయునంటే గ్రామసహకార సంఘములు పరపతిగల పూచీ సంఘములుగ మార్చవలయును. ఒక ఊరునకు ఒక సహకార సంఘము పని చేయజాలదు. గ్రామ సమూహములకు గ్రామ సహకార సంఘములు వ్యాప్తి కావలయును. ఒకే సంస్థలో పరపతి పరపతేతర వ్యాపారము కొనసాగవలయును. రైతు పెట్టుబడికి ధనమిచ్చుటయే గాక సంవత్సరముపొడుగున అతనికి కావలసిన సరుకులను ఋణమునీయవలయును. అతను పండించిన పంట యొక్క ముఖమున హెచ్చు ధరకు విక్రయము కావలయును. అనగా ఉత్పత్తి సరుకుల వ్యాప్తి కొనుగోలు వ్యాపారమును యీ మూడును సహకార సంఘములో మిళితము చేయవలయును. ఇందుకు సహకార సంఘములో అనుభవము కలిగి తరితేరిన సిబ్బంది నియోగింపబడవలయును. కొద్ది వ్యాపారము కలిగిన సహకార సంఘములు యిట్టి సిబ్బందిని నిర్వహించుకొనజాలవు. కాలువలు మేట వేసుకొనిపోయిన, నాచు చెత్త, తుక్కు పెరిగిపోయిన యెంత ప్రవాహము పైనుంచి వచ్చినను తూరలు మూసుకొని పోయి పొలములకు నీరుయెట్లు పారదో ఆ రీతిగనే పైనుంచి యెంత ధన ప్రవాహము కొట్టుకువచ్చినను స్తంభించిపోవునేకాని ప్రయోజనకారి కాజాలదు. గత 50 సం॥ రములలోను చేసిన ఉద్యమ నిర్మాణము మార్పుచేసినగాని ఉద్యమము చిరస్థాయిని బహుళ వ్యాప్తి కాజాలదు. ఉద్యమము సక్రమమార్గముల నిర్వహింపచేయుటకు Rural credit Survey కమిటీ సభ్యులు ఉద్యమ భావి పురోభివృద్ధికి ప్రణాళికను సూచించిరి. వీరి సలహాలు పాటింప తగినవి.

సహకారోద్యమము నేడు తల బరువైనదని కాళ్లు సన్నగిల్లినవని చెప్పక తప్పదు. రైతులకు హెచ్చువడ్డీలకు ధనము సరఫరా చేసిన లాభములేదు. వ్యవసాయము కిట్టుబాటగుటకు తక్కువ వడ్డీకి రైతులకు ధనము సరఫరాచేయవలయును. రైతులు నేడు ఋణముల పాలగుటకు కారణము హెచ్చువడ్డీ రేటేను. వ్యవసాయము మీదవచ్చెడి ఆదాయము వర్తకముమీద వచ్చు ఆదాయమువలె హెచ్చుగ నుండదు. సర్వసాధారణముగ హెచ్చు తగ్గులు లేకుండ నుండవలెను. 100 కి రు. 4 లు మించి వ్యవసాయముమీద ఆదాయము కిట్టుబాటుకాదు. ఈ అంచనా ఆర్థికవేత్తలందరు ఒప్పుకొనునదే. హెచ్చువడ్డీకి అప్పుచేసిన రైతు తక్కువ ప్రతిఫలములో ఆదాయము వచ్చిన యెట్లు తీర్చగలడు. అందుచేతనే పంజాబు సహకార రిజిస్ట్రారుగ పనిచేసిన డార్లింగు యీ క్రింది వాక్యమును చెప్పిరి.

"The Indian ryot. is corn in debt, lives in debt, dies in debt, and bequeths debt."

ప్రభుత్వము వారు రిజర్వుబ్యాంకు వారి ద్వారా సహకారోద్యమమునకు తక్కువవడ్డీకి సరఫరాచేయుచున్నారు. రాష్ట్రీయబ్యాంకునకు 100 కి 1½ % వడ్డీకి కోట్లరూపాయిలు నిచ్చుచున్నారు. రాష్ట్రీయ బ్యాంకువారు యీ ధనమును జిల్లాకేంద్ర సహకారబ్యాంకులకు 2½ % రూపాయిలకు వడ్డీకి యిచ్చుచున్నారు. జిల్లా బ్యాంకులు సహకార పరపతిసంఘములకు 4½ % రూపాయిలు చొప్పున యిచ్చుచున్నారు. సహకార పరపతి సంఘములు తమ సభ్యులకు 6-1/4 % చొప్పున నిచ్చుచున్నవి. అంతర్వులమీద అంతర్వులు కట్టుటచే 1½ % ఉద్యమములోనికి వచ్చినడబ్బు సభ్యునికి చేరునరికి వివిధ సహకార సంఘములు 4¾ % లాభము వేసుకొని సభ్యునికి అందచేయుచున్నారు. తక్కువవడ్డీకి సభ్యునికి ధనము సరఫరా చేయుచున్నామని సహకారులు ప్రతాపములు చెప్పుచున్నారే యింత లాభముతీయుట అనుచితము. ఇందుకు సరియైన ఉద్యమ పునర్నిర్మాణము కావలయును. మధ్యఅంతర్వులు కొన్ని తగ్గించవలయును. లేదా లాభము తగ్గించుకోవలయును. కోట్లకొలది వ్యాపారము చేసెడి రాష్ట్రీయ బ్యాంకులు సెంట్రలు బ్యాంకులు పోస్టాఫీసు పని చేసినందుకు 3% లాభము వేసుకొనుట అనుచితము అక్రమము అని హిందూ పత్రిక అధిపతులు తమ ప్రధానవ్యాసములో ది 22 వ పత్రికలో విమర్శించిరి. ఈ లాభములు తగ్గించి రైతులకు తక్కువ వడ్డీకి యిచ్చుటకు రిజర్వుబ్యాంకు వారు సహకారోద్యమనిర్వాహకులతో సంప్రదించి గట్టి ప్రయత్నము చేసి వడ్డీ రేటు తగ్గించవలసినదిగా సలహా నిచ్చిరి.

ఇందుకు ఒకటే మార్గము కనిపించుచున్నది. ప్రభుత్వమువారు దేశమంతటను స్టేటుబ్యాంకులను నెలకొల్పి వివిధ రాష్ట్రములలో, మండలములలో తాలూకాలలో బ్రాంచీలు నిర్వహించి నట్లుగనే ప్రతి రాష్ట్రములోను తహశీలులోను బ్రాంచీలు నిర్వహించిన యీ అంతస్తులలో ధనము పేరుకొనకుండగ, స్టేటుబ్యాంకు, గ్రామసంఘము మధ్యన అవాంతరము లేకుండగ చేసిన సభ్యులకు తక్కువ వడ్డీరేటునకు సహకార సకలార్థ సంఘముల ద్వారా గ్రామ సమూహములతో కూడిన రూరలుబ్యాంకులు బాగుగ పనిచేయగలవు. స్టేటు బ్యాంకు బ్రాంచీలు బాగుగ పనిచేయుటకు ప్రతి బ్రాంచి కార్యస్థానములను రెగురు మించకుండగ రెస్సురు తగ్గకుండగ సలహా బోర్డులను యేర్పాటు చేయవచ్చును. ఇది విప్లవాత్మకమైన సూచన. సహకారులలో యీ అభిప్రాయము ఆటంబాంబువలె కల్లోలపరచకతప్పదు. అయితే ఉద్యమమువలన అధికలాభము కలుగజేయవలెనన్న యింతకంటే వేరు గత్యంతరము లేదు. "Centralise-Finance Decentralize Supervision"

ఆర్థికవ్యాపారము కేంద్రీకరించబడవలయును, తనిఖీ వ్యాపారము వికేంద్రీకరింపబడవలయును. ఇది ఆర్థిక వ్యాపార వ్యవహారములలో పాటింపవలసిన నియమము. సహకార స్థానిక యూనియనులు, జిల్లా సహకార యూనియనులు రాష్ట్రీయ సహకార యూనియనులు ఉద్యమ తనిఖీకి ఉత్తమ సహకార విజ్ఞాన వ్యాప్తికి తోడ్పడవలయును. నేడీ సంస్థలు నామమాత్రావశిష్టముగ నున్నవి. పరభృతములైనవి. సహకారోద్యమము ఉన్నత స్థాయిని సర్వతోముఖాభివృద్ధిగా ప్రవర్ధమానము కావలయు నన్న యిట్టి మార్పు ప్రభుత్వము వారు, సహకారులు, ఉద్యమవాదులు చేకూర్చినగాని గత్యంతరము లేదు.



మాన్‌సింగ్.



మాన్‌సింగ్ భార్య.

# కల్లోకపడితే-పాపం కలతపెట్టిన మొనగాడు మాన్‌సింగ్

## 27 ఏళ్లు ఉత్తరప్రదేశ్, రాజస్థాన్, మధ్యభారత్ మధ్యప్రదేశ్ లను చెండుకుతిన్న బందిపోటు నాయకుడు

న్యూఢిల్లీ, అగస్టు 25-వ తేదీ. కొంచెం పొద్దెక్కింది. దేశీయాంగ మంత్రి శ్రీ గోవింద వల్లభపంత్ ఏదో పని చూసుకొంటున్నారు. టెలిఫోన్ గంట మోగింది. ఆయన రిసీవరు తీసి వింటూ, ముఖంలో ఆశ్చర్య సంతోషాలు ముప్పిరిగొనగా, 'ఆ, నిజంగానా, అమ్మయ్యా, ఎన్నాళ్ళకు ఈమాట విన్నానూ' అన్నారు.

దేశంలోని దాదాపు 40 కోట్ల ప్రజల ప్రాణ, విత్త, మానాల రక్షణ బాధ్యత నెత్తినిమీదగల అంతటి పంత్‌ని అంత సంతోషపెట్టిన వార్త, ఎంతో భారం తొలిగినట్లు చేసిన ఆ వార్త, ఏమిటది?

మాన్‌సింగ్ చనిపోయాడు. తుపాకి కాల్పుల కెరయైపోయాడు. ఆరోజు తెల్లవారుతూ వుండగానే ఆపని జరిగింది. మధ్యభారత్ లోని ఒక కుగ్రామం దగ్గర జరిగింది. ఆరాష్ట్ర అంతరంగిక శాఖ మంత్రి శ్రీ నరసింగరావు దీక్షిత్ అతి సంతోషంతో, సాధించిన గొప్ప విజయంగా, ఆవార్తను పంత్ కి తెలియచేశారు.

ఆసాయంత్రం, మర్నాడు ప్రొద్దునా దేశంలో వెలువడిన పత్రికలన్నీ ఈ వార్తను అత్యంత ప్రముఖంగా ప్రచురించాయి. ఆప్రచురించటంలో ఎంతో ఉత్సాహం, ప్రత్యేకతా చూపటానికి ప్రయత్నించాయి.

దేశం నలుదిశలా ఇంత హడావిడి కలిగించిన ఈమాన్‌సింగ్ ఎవరు? ఎక్కడివాడు? మంచోచెడ్డో ఇతనికి ఇంత ప్రాముఖ్యం ఎట్లా వచ్చింది?

ఇటీవల వినవస్తూ వచ్చింది ఇదీ: ఈ మాన్‌సింగ్ ఒక పెద్ద బందిపోటు. హంతకుడు. ఉత్తర ప్రదేశ్, మధ్య ప్రదేశ్, మధ్య భారత్, రాజస్థాన్ ప్రజలను చెండుకుతిన్నాడు. పేరు చెబితే గడగడ లాడేటట్లు చేశాడు. ఇతని దుర్మార్గాలకు ఎన్నో అమాయక ప్రాణాలు బలిఅయిపోయాయి. ఎంతో సొత్తు దోచుకున్నాడు. ఇంతే.

### పురోహితుని వంశం నిశ్శేషం

కాని మాన్‌సింగ్ గాథ ఇంకా ఎంతో వుంది. ఇతని జన్మస్థానం ఉత్తరప్రదేశ్ లోని ఆగ్రా జిల్లాలో గల రాఠోడ్ ఖేరా. ప్రసిద్ధమైన ఉన్నత కుటుంబంలో పుట్టాడు. అటువంటి వాడు దోపిడిగాడు ఎట్లా అయ్యాడా అనిపిస్తుంది. నిజమే. విధి వైపరీత్యం అనాలి. మాన్‌సింగ్ దుర్మార్గానికి అంకురార్పణ వ్యక్తిగతమైన విద్వేషంతో జరిగిందంటారు. రాఠోడ్ ఖేరాలోనే వీరికుటుంబ పురోహితుడు తులసీరాం అని వుండేవాడట. ఆయనతో ఈయనకు ఏదో పేచీ వచ్చిందిట. ఆ పురోహితుని వంశం నిర్మూలం చేయడానికి పూనుకొన్నాడట. ఆ పని చేశాడు. ఆ బ్రాహ్మడి వంశంలో ఇప్పుడు ఎవ్వరూ లేరట. ఆఖరివాడు జైలులో వుండిన నేత్రం అనే ఆయన. ఈయనను చంపి రెండేండ్లయింది.

ఈ పాపకార్యం పూర్తి చేయటానికి అతను అహమ్మదాబాదు, బొంబయి నగరాలలో కూడా హత్యలుచేశాడట. ఇతను మొట్టమొదట హత్య చేసింది 1928-లో అని అంటారు. 1942 నాటికి పూర్తి విద్రోహి అయాడు.

### బాబా మాన్‌సింగ్!

అయితే ఈ విద్రోహం సమాజంలో అతని స్థితికి ఏమీ భంగం కలిగించలేదు. అదే విచిత్రం. గ్రామంలో ప్రజలు అతనిని తమ పెద్దగానే ఎంచి, వారి వారి తగాదాల తీర్పు అతనివద్దకే పెడుతూండేవారట. అతను 'వీర విహారం' చేసిన 8 వేల చదరపు మైళ్ళ ప్రాంతమంతటా అతనిని రాజా మాన్ సింగ్ అనీ, లేదా బాబా మాన్‌సింగ్ అనీ పేర్కొనేవారట.

ఇందుకు కారణంగా ప్రజలు సాధారణంగా చెప్పేది అతడు దోపిడీలు చేసినా, హత్యలు చేసినా మరే దుర్మార్గం చేసినా పూరికే చేయలేదని. కేవలం దుర్మార్గంతో చేయలేదని. దోపిడీ చేసిన డబ్బును పేదలకు పంచిపెట్టేవాడట. హత్యలు చేస్తే, చనిపోయినవాని ఆశ్రితులకు ఆధారం చూపించేవాడట. తనను ఆశీర్వదించిన బ్రాహ్మణులంటే భక్తి ప్రపత్తులు చూపించేవాడట.

### గుసగుసల్లో అభిమానాలు

ఇది ఆనోటా ఆనోటా విన్నది కాదు. ఆమధ్య మధ్యభారత్ ప్రభుత్వం ఒక విచారణ సంఘాన్ని నియమించింది. వారు మాన్‌సింగ్‌ను గురించి వ్రాసిన నివేదికలోనే ఈ అంశాలు వున్నాయి. అతణ్ణి గురించి ప్రజలు మెచ్చుకోలుతో ఎన్నో కథలు గుసగుసలుగా చెప్పుకొనేవారట. [illegible] అతడు ఎట్లా సహాయం చేసిందీ, బాగా వున్న వారివద్ద మాత్రమే ఏ విధంగా దోచిందీ, బడులకూ వాటికీ భవంతులు కట్టించడం మొదలైన మంచి పనులకు డబ్బు ఇచ్చేందుకు జమీందార్లు మొదలైన వారిమీద ఏ విధంగా జబర్దస్తీ చేసిందీ కథలు కథలుగా చెప్పుకొనేవారట.

తనను గురించి పోలీసులకు తెలిపే వారినీ, తనను వెంబడించిన పోలీసులనూ మాత్రమే అతను చంపేవాడట. లేకపోతే వాళ్ళ జోలికే పోయేవాడు కాడట. పోలీసులంటే అసలు మాన్ సింగ్‌కు ఎన్నడూ భయంలేదట. జిల్లా పోలీసు కార్యాలయానికి అల్లంత దూరంలో నైనాసరే తన శత్రువు అయినవాడు కనిపిస్తే కాల్చి చంపి వేసేవాడట.

### వైభవ జీవితం

అధికార పత్రాలలోనే ఒక సంఘటనను గురించి ఇట్లా వుంది: నమ్మశక్యం కానిదిగా కనిపించవచ్చు. కాని వాస్తవంగా జరిగింది ఇది. మాన్‌సింగ్ స్వగ్రామంలో స్వగృహంలో బ్రహ్మాండంగా తన మనమని పెళ్ళి చేశాడు. విసుగులు, కాల్పులు, సంతర్పణలు, సమారాధనలు సకల వేడుకలతో ఆ పెళ్లి జరిగింది. భోగం మేళం పెట్టాడు. ఈ విందులూ వేడుకలలో ఆ ప్రాంతపు తహసీల్ దారు, స్థానిక ప్రభుత్వ వైద్యోద్యోగి, పోలీస్ స్టేషన్ పెద్ద ఉద్యోగి మొదలైనవారు కూడా పాల్గొన్నారు. పెద్ద పెద్ద జమీందారులు, షావుకారులు స్వయంగా వచ్చినవారూ వున్నారు, తమ తరఫున ఎవరినో ఒకరిని పంపిన వారూ వున్నారు.

ఇట్లా మాన్‌సింగ్ జీవితం ఎదురులేకుండా మహా వైభవంగా జెల్లిపోతూ వున్నా అతనికి శాంతిలేదు. సుఖంలేదు. అనుక్షణం ప్రమాద భరితంగానే వుండేది. తాను తన శత్రువులను ఎట్లా తుద ముట్టిస్తూ వచ్చాడో అట్లాగే తన శత్రువులూ, పోలీసులూ తన వారిని తుద ముట్టిస్తూ వచ్చారు. బంధువులు, అనుచరులు చాలామంది అట్లా చనిపోయారు. లేదా పట్టుబడి పోయారు.

### కర్కశత్వానికి వయఃపరిపాకం

నిరుడు సెప్టెంబరులో మాన్‌సింగ్ కొడుకు తహసీల్ దార్ సింగ్ పట్టుబడిపోవటంతో, అది అన్నిటికంటే పెద్దదెబ్బఅయి, అతను కుంగిపోయాడు. తహసీల్ దార్ సింగ్ మాన్‌సింగ్‌ముఠాకు పెద్దప్రాపు. అతను లేకపోయేసరికి వృద్ధుడవుతున్న తండ్రిలో కఠినత్వం హెచ్చుపెరిగింది. కనికారం అనేది లేకుండాపోయింది. ఊచకోతకు దిగాడు. ఒక్కొక్కప్పుడు ఈ ఊచకోతలలో లఖన్ సింగ్ కూడా పాల్గొన్నాడు. తననుగురించి పోలీసులకు తెలుపుతున్నారని అనుమానం తగిలిన వాళ్లను భయపెట్టటం, అవమానించటం మొదలు పెట్టాడు.

దీనితో పల్లెప్రాంతాలలో అతనంటే వుంటూవచ్చిన అభిమానం సన్నగిల్లింది. పోలీసుల పని సులభ మయింది.

### అధ్వాన్నం: శత్రుమధ్యం

మంచిపాడులు అక్కడక్కడా కనిపించినా దుర్మార్గం దుర్మార్గమే. ఎన్నాళ్ళో సాగదు. ఎవ్వరూ ఎల్లకాలం సహించరు. సహించలేరు. ఈ స్థితిగతులలో మాన్‌సింగ్ దురాగతాలకు గురి అయిన నాలుగురాష్ట్రాల ప్రభుత్వాలు ఈ ముఠాను పట్టుకోవటానికి, లేదా తుదముట్టించటానికి గట్టిగా పూనుకొన్నాయి. అతని ముఠాను తప్పించుకు పారిపోయే దారిలేకుండా దిగ్బంధం చేసుకొంటూ వచ్చాయి. అతను భింద్ ప్రాంతంలో ఇరుక్కుపోయాడు. మొన్న ఫిబ్రవరిలో రాజస్థాన్‌లోకి తప్పించుకుపోవటానికి ప్రయత్నించాడట. కాని సరిహద్దున కాపలావున్న వారు కాల్పులు ప్రారంభించేసరికి వెనక్కి తిరిగాడట.

1954 ప్రారంభంనుంచీ ఏడాదిన్నర కాలంలో మాన్‌సింగ్‌ముఠాకీ పోలీసులకీ 80 సార్లు పోరాటాలు జరిగాయి. 30 మంది పోలీసులు ప్రాణాలు కోల్పోయారు.

### తుది పోరాటం

మాన్‌సింగ్ మరణానికి దారితీసిన తుదిపోరాటం ఏ విధంగా జరిగిందీ అందులో పాల్గొని, దానిని నడిపిన జమేదార్ భన్వర్ సింగ్ థాపా ఇట్లా చెప్పాడు: మాన్‌సింగ్‌నీ, అతని ముఠానీ పరిమార్చటానికి మార్చిమాసంలో ఒక 'కంపెనీ' భటులను ఏర్పాటుచేశారు. అందులో 20 మంది గూర్ఖాలుగల మా ప్లాటూన్ ఒకటి. మాకు ప్రత్యేక తర్ఫీదు ఇచ్చి, టామీగన్స్, చేతిబాంబులు మొదలైన ఆధునిక ఆయుధాలిచ్చారు. క్లిష్ట పరిస్థితులలో వాడుకొనేందుకు బహువైటమినులు వుండే బిళ్ళలుకూడా ఇచ్చారు.

ఆగస్టు 25 తెల్లవారకట్ల మేము భింద్ చేరాము. వెంటనే అక్కడికి 8 మైళ్ళ దూరంలో బిజాపూర్ అనే గ్రామం వద్ద గల క్రోకేన్‌కాపురాకి బయలుదేరవలసిందని మాకు ఉత్తరువు లిచ్చారు. మాన్‌సింగ్, అతనిముఠా అక్కడవున్నట్లు చెప్పారు. మా మూడు ప్లాటూనులలో మాది మధ్యనువుంది. మిగతావి దీనికి కుడి, ఎడమలుగా కొంత కొంత దూరానవున్నవి. మేము క్రోకేన్‌కాపురాకి కొంచెం దూరంలోకి వచ్చేసరికి కొందరు మనుషులు ఆరుబయటకూర్చుని ఏదో తింటూ పాలుతాగుతూ వుండటం కనిపించింది. మేము వారు కూచున్నచోటికి 60 గజాల సుమారులోకి చేరేటప్పటికి వున్నట్టుండి మా పైనుండి వర్షం కురవసాగింది. వెంటనే, సర్దుకొని ఎదురు కాల్చమని మా వాళ్లకి ఆజ్ఞ ఇచ్చాను. అది మైదానంలా చదునుగావున్న ప్రాంతం నెరసిన పుస్తీలున్న ఒకమనిషి ఒక రావిచెట్టు చాటున నిలబడి టామీగన్ పేలుస్తున్నాడు. మాకు చెప్పిన దానినిబట్టి అతనే మాన్ సింగ్ అని గ్రహించాను. మా వాళ్ళందరికీ, అతనిమీదనే కాల్చవలసిందని చెప్పాను. అప్పటికప్పుడే మా వాళ్ళలో దాదాపు అరడజనుమంది దుండగీసుల గుండ్లవల్ల గాయపడ్డారు. గోవింద్ బహదూర్ థాపా మా అందరికంటే ముందువున్నాడు. "అదిగో అతనే మాన్‌సింగ్" అని నేననటం విని తన టామీగన్‌తో మాన్ సింగ్‌మీదికి ఏడు గుండ్లు పేల్చాడు. మాన్‌సింగ్ ఎదురు పేల్చాడుగాని, అతనే ముందు నేలకు ఒరిగాడు. తర్వాత నే థాపా.

మాన్‌సింగ్ ముఠాలోని సుబేదార్ సింగు, రూప తమ నాయకుని కళేబరం ఎత్తుకుపోవటానికి ప్రయత్నించారు. కాని నేను పేల్చిన తుపాకిగుండ్లకు గురి అయారు. బిగ్గరగా ఏడుస్తూ, మమ్మల్ని అందర్నీ చంపివేస్తామని వాళ్లిద్దరూ కేకలువేశారు. మాన్‌సింగ్ కళేబరం వాళ్ల వద్దే వుంది. మేము ఇంకా 20 గజాలలో ఉన్నాము. మాలో గాయ పడిన వాళ్ళుకూడా కాల్పులు సాగించ వలసివచ్చింది. ఒక పావు గంట అయేసరికి దుండగీండ్లు ఆ కళేబరం అక్కడే వదిలిపెట్టి పారిపోవటం ప్రారంభించారు. అంతలో మా యితర ప్లాటూన్ల కాల్పులు వినిపించి మాకింకా ధైర్యంవచ్చి, ఆపారిపోయే వాళ్లలో వీలైనంత మందిమీదికి కాల్చటం మొదలుపెట్టాం. 3 ప్లాటూన్లూ కలుసుకొన్నాక మా వాళ్లలో నన్ను మాన్‌సింగ్ కళేబరం తీసుకొని భింద్ వెళ్ళమన్నారు. మిగతా వాళ్ళు దుండగీళ్లను వెంబడించారు.

### కోటి రూపాయలు ఖర్చు!

ఈవిధంగా 27 ఏండ్లు అవిచ్ఛిన్నంగా దుర్మార్గాలు సాగించిన దుండగీడు అంతరించాడు. అతడు మొత్తం 185 పైచిలుకు హత్యలు చేసి వుంటాడనీ, 1000 కి మించి బందిపోట్లు జరిపి వుంటాడనీ అంటారు. ఈ 65 ఏండ్ల 'జాంగల' నాయకుని పట్టుకొంటే రూ 14,000/- బహుమతి యిస్తామనికూడా ప్రభుత్వం ప్రకటించివుంది.

మధ్య భారత్, రాజస్థాన్, ఉత్తర ప్రదేశ్ ప్రభుత్వాలు ఈ మాన్‌సింగ్‌నీ అతని ముఠానీ పరిమార్చటానికి గాను ఇంతవరకూ ఖర్చుపెట్టింది కోటి రూపాయలకు తక్కువ వుండదు.

# గగనసీమలోకి మానవుని ప్రయాణ ప్రయత్నాలు: ఉపగ్రహాన్ని వదలడానికి ప్రథమ పథకం



బలీయమైన రాకెట్ — కృత్రిమ ఉపగ్రహాన్ని పైకి తీసుకొనిపోయేది.







భూమిని వదలి పైకి వెళ్ళి కృత్రిమగ్రహం ప్రయాణంచేసే తంతు.

రాకెట్ పోయేమార్గం: పై బొమ్మలో ఒకటి అని వేసినచోట కృత్రిమ ఉపగ్రహాన్ని వేసుకొని ఒక పెద్ద రాకెట్ పైకి బయలుదేరుతుంది. ఆ పెద్ద రాకెట్‌లో మరి రెండు రాకెట్లు ఒక దాన్లో ఒకటి ఇమిడిఉంటాయి. ఈ మూడు రాకెట్ల దొంతర, ఉపగ్రహంతో పాటు యాభై అరవైమైళ్ళపైకి బాగా గాలి ఉండే ప్రాంతంపైకి పోతుంది. రెండు అని వేసిన చోటకు వెళ్ళి, అందులో ఒక రాకెట్ వూడి — ప్రేలిపోతుంది. దొంతరలోని రెండో రాకెట్ బలంతో ప్రయాణంపైకి సాగుతుంది. మూడు అని వేసినచోట రెండో రాకెట్ ఊడిపోయి ప్రేలిపోతుంది — మూడో రాకెట్ ప్రయాణం సాగిస్తుంది ఉపగ్రహాన్ని వేసుకొని. ఇది గాలిలేని గగనసీమ. నాలుగు అనివేసినచోట ఆ మూడో రాకెట్‌కూడా విడివడి ప్రేలిపోతుంది; ఉపగ్రహం మిగులుతుంది. ఇక అది భూమిచుట్టూ యాత్ర సాగిస్తుంది.

క్రింది బొమ్మ ఈ రాకెట్ పోగల ఎత్తులను చూపుతుంది. ఎవరెస్టుశిఖరం ఉన్న మండలంలోనే ఉంది. ఆ మండలంవరకూ ప్రాణులకు అవసరమైన గాలి లభిస్తుంది. పోను పోనూ గాలి పల్చబడి, పల్చబడి చివరకు నిర్వాయుమండలం ఏర్పడుతుంది. ఆ మండలంలో ఈకృత్రిమ గ్రహాలు నిర్నిరోధంగా ప్రయాణం చేస్తాయి.

## రైట్‌సోదరుల నాటినుంచీ...

అర శతాబ్దం క్రిందట "రైట్ సోదరులు" విమానం కనిపెట్టినప్పటి నుంచీ, ఆ సిద్ధాంతంపై సాగుతున్న పరిశోధన అనేకం. ఇవ్వాళ రైట్ సోదరులు 'కెటీ హాక్'లో ఎగిరి విమానం చూస్తే ఎలా ఉంటుంది! అప్పుడే అది పాతకాలం సంగతి అయిపోయింది. ప్రస్తుతం మన పుడమిగగనాంతరాళాల్లో నిర్వాయుసీమల్లో క్షేమంగా ఎట్లా ప్రయాణం చేయడమా అనే పరిశోధన ప్రధానమైపోయింది. ఈమధ్య అమెరికా, తాను కృత్రిమ చంద్రగోళాలను భూమిచుట్టూ పంపుతున్నానని ప్రకటించింది. రష్యా కూడా ఇదే ఆలోచనలో ఉన్నట్టు తర్వాత తెలిసింది.

గాలి సముద్రమట్టం మీద చిక్కగా ఉండి విమానాల్లో పెట్రోలు సాక్షిగా ఇంధనంగా మారేందుకు సహాయపడుతుంది. ఆ గాలిలో ఎక్కువ మోతాదులో ఉండే ఆమ్లజని అందుకు కారణం. కాని, గాలి చిక్కగా ఉండటంవల్ల, విమానవేగం కాస్త మందగిస్తుంది. పైకి పోయినకొద్దీ విమానవేగానికి అంతరాయం ఏమీ ఉండదు; పైకి పోయినకొద్దీ గాలి పల్చబడుతుంది కాబట్టి. కాని ఆమ్లజని తక్కువైపోతుంది. అంటే చలనానికి అవసరమైన వాయువు తగ్గిపోతుందన్న మాట. విమానానికిఅదొక సమస్య.

## ఆమ్లజని సమస్య

రాకెట్‌లో ఆమ్లజనిని కూడా వేసుకొని పోవచ్చు. నిర్వాత మండలంలోకి వెళ్లి ప్రయాణంచేస్తుంది. అయితే భూమి ఆకర్షణశక్తి నెలా తప్పించుకోవడం. చంద్రుడు భూమిచుట్టూ తిరుగుతున్నాడు—కాని భూమి ఆకర్షణ శక్తి వల్ల భూమిపైపడు రావడం లేదుకదా. గంటకు 25 వేల మైళ్ల చొప్పున పోతే, అట్లాగే కృత్రిమగ్రహాలు భూమిచుట్టూ ఆకర్షించబడకుండా తిరగవచ్చు అని శాస్త్రజ్ఞుల భావన. అట్లాతిరిగే రాకెట్‌ను తయారు చెయ్యడానికి కృషి బాగా జరుగుతోంది.

రాకెట్‌ను ప్రథమంగా జర్మనులు గతయుద్ధంలో కనిపెట్టారు. అప్పటి నుంచీ అంటే 1949 నుంచీ పరిశోధన సాగుతోంది. 5 వేల మైళ్ల దూరంలో అనుకున్నచోట బాంబులువేసే ఆయుధ యంత్రాలను నిర్మిస్తున్నారు. మధ్యలో మానవునిలో సహజంగాఉన్న మంచి తనం కొద్దీ, ఈకృత్రిమ గోళాల పరిశోధన సాగింది. 250 మైళ్ల పైకి రాకెట్ల దొంతరను వదలి చూశారు. ఫలితం అనుకూలంగానే ఉంది.

## బాస్కెట్‌బాల్ అంతగోళం

అమెరికా ప్రకటన ప్రకారం బాస్కెట్‌బాల్ అంతఉంటే 100 పౌన్ల గోళాన్ని మూడు రాకెట్ల దొంతరలో ఉంచి, నిలువునా పైకి వదులుతారు.

ఈగ్రహం రెండు మూడొందల మైళ్లు ఎత్తులో ఎగురుతూ $1\frac{1}{2}$ గంటల్లో భూమినిచుట్టి వస్తుంది. అలా కొన్నాళ్ళు, కొన్ని వారాలు తిరిగీ తిరిగీ పడిపోయి భస్మమౌతుంది.

ఈ గోళం మనకు బాగా కనపడక పోవచ్చు. ఉభయ సంధ్యల్లో కనపడే అవకాశం ఉంది. అయితే యంత్రాల సాయంతో దీని గమనాన్ని కనిపెడుతూ ఉంటారు.

ఈ గోళంలో ఏ పదార్థాన్ని పెట్టాలా అనేది నిర్ణయం కాలేదు. దీనికి ఒక యంత్రాన్ని తగిల్చి, దానిద్వారా, ఆ పై ప్రదేశాల్లోని వాయుసాంద్రత, ఆకర్షణశక్తులు, శీతోష్ణాలు, చలనాలు వగైరాలు తెలుసుకోవచ్చు. ఇప్పటి లెక్కల ప్రకారం, అసలు ఆ గోళం పతనం అవడం బాగా చూసి కొన్ని వివరాలను సేకరించవచ్చునంటున్నారు.

అవన్నీ ముందు తెలుస్తే, తర్వాత మానవుడుకూడా పైకి పోగలడు.

ముందు ముందు, కుజుడు (భూసుతుడు) మొదలైనగ్రహాల్లో మన చుట్టాలుంటారు. మనవాళ్లు ఉద్యోగాలకు విహారాలకు పోతారు. అప్పుడు భూమిమీద ఉండటం అనాగరిక మౌతుందేమో!



హైదరాబాద్ హిందీ ప్రచార సభ హిందీ పరీక్షలు ఇటీవల గుంటూరు యు. ఎల్. సి. ఎం. హైస్కూలులో జరిగాయి. ప్రచారక కంఠంపాటి సత్యనారాయణ, విద్యాశాఖాధిపతి డి. కే. రత్నంగారలు, యీనాటి పరీక్షకుపోయిన సెంటర్ బాలికలు ఉన్నారు

# సినిమా

## నగరంలో సినిమాలు

| | |
|---|---|
| కాసినో, క్రౌన్ | మిస్సమ్మ (తెలుగు) |
| బ్రాడ్వే | జాతకఫలం ,, |
| చిత్రా, ప్రభాత్, సరస్వతి | మంగయార్ తిలకం (తమిళం) |
| మహారాణి, లక్ష్మి (అమింజికరై), సన్, కపాలి | కణవనే కంకండ దైవం ,, |
| శ్రీకృష్ణా, గెయిటీ, రాజకుమారి, ఉమా | గుళేబకావళి ,, |
| ఈరాస్ | అవ్వయ్యార్ ,, |
| రాక్సీ | ఎల్లాం ఇన్బమయం ,, |
| భారత్ | హసీనా (హిందీ) |
| ప్లాజా | నాగిన్ ,, |
| అశోక్ | మునీంజీ ,, |
| స్టార్ | హౌస్ నం. 44 ,, |
| న్యూగ్లోబ్ | Judgement of Paris |
| మిడ్‌లాండ్ | Bean Brummel |
| మినర్వా | Sabrina |
| న్యూఎల్ఫిన్‌స్టన్ | King Richard and the crusaders |
| ఓడియన్ | Mambo |

## "సర్దార్"

జ్ఞాన్ ముఖర్జీ నిర్మించిన "సర్దార్" హిందీ చిత్రం మద్రాసు వెలింగ్టన్‌లో ఈనెల 2 వ తేదీన విడుదల అయినది, అశోక్‌కుమార్ బీనారాయ్, నిగార్, జగదీష్‌సేఠీ, రామసహల్ మున్నగువారీ చిత్రంలో నటించారు. దర్శకుడు జ్ఞాన్ ముఖర్జీ; సంగీత దర్శకుడు జగ్‌మోహన్ ఛాయాగ్రహణ దర్శకుడు కె. హెచ్. కపాడియా. దార్లుకొట్టి ధనం సంపాదించే దొంగల సర్దార్ ఈచిత్రంలో కథానాయకుడు. సంఘంలో పెద్దమనిషిగాను, చాటుగా దొంగల నాయకుడుగాను వ్యవహరిస్తూ, అనేక సంవత్సరాలు పోలీసుల కన్నుగప్పి ప్రజలను వానిలకొడుతూ ఉంటాడు. అతన్ని పట్టుకోడానికి రంజిత్ అనే పోలీసు అధికారి బయల్దేరి విశ్వ ప్రయత్నం మీద చివరికి సాధిస్తాడు.

సర్దార్‌గా జగదీష్, రంజిత్‌గా అశోక్‌కుమార్, సర్దార్ పెంచిన బాలికగా బీనారాయ్ చాలా సమర్థతతో నటించారు. హేమంతకుమార్, లతా, ఆశా మున్నగువారు పాడిన 'ప్లేబాక్' పాటలు శ్రావ్యంగా ఉన్నాయి. దర్శకత్వం, ... ఈచిత్రం ... బాగా ... సాధారణ హిందీ చిత్రాలకంటే ఈచిత్రం ఒక మెట్టు పైస్థాయిలోనే ఉన్నది.



సమాగమము (తైలవర్ణ చిత్రము)



"తెలుగునాట గ్రామసీమ" (టెంపరా) హెచ్. వి. రామగోపాల్.

# హెచ్. వి. రామగోపాల్ చిత్రలేఖన ప్రదర్శనం

మదరాసు, సెప్టెంబరు 2: చిత్రకారుడు శ్రీ హెచ్. వి. రామగోపాల్ చిత్రించిన వర్ణచిత్రములు, స్కెచ్‌లు, ఇతర చిత్రములు ఆగస్టు 29 వ తేదీనుండి, మదరాసు, స్కూల్ ఆఫ్ ఆర్ట్సు ఎండ్ క్రాఫ్ట్సు మ్యూజియం హాలులో ప్రదర్శింపబడుతున్నవి. ఈ ప్రదర్శనమును మదరాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ పి. వి. రాజమన్నారు ప్రారంభోత్సవం చేశారు.

"ఈ ప్రదర్శనంవలన ఒక చిత్రకారునియొక్క వ్యక్తిత్వమును, అతని చిత్రలేఖన పరిణామమును గ్రహించ వీలవుతున్నది," అని శ్రీ రాజమన్నారు అన్నారు.

"శ్రీ రామగోపాల్ శ్రీ దేవీప్రసాద్ రాయ్ చౌధురి శిష్యుడు. చౌధురిగారిలోవున్న విశేషమేమంటే, ఆయన తన విద్యార్థులలో నిద్రాణంగా ఉన్న వ్యక్తిత్వాన్ని వెలికి తీసుకొనివచ్చి, దాన్ని వ్యక్తపరచడంలో సహాయపడతారు. అందుచేతనే ఆయన విద్యార్థుల చిత్రకళలో వారివారి స్వయం ప్రతిభయే వ్యక్తమవుతుందిగాని, గురువును అనుకరించడం కనబడదు. రామగోపాల్ గారి చిత్రకళలో ఏదో విలక్షణంగా కనబడాలనే తాపత్రయం కనబడదు. అందుచేతనే సమకాలిక యువ చిత్రకారులలో కనబడని సాంప్రదాయికత రామగోపాల్ గారిలో కనబడుతుంది. అంతమాత్రాన ఆయన కొత్త ప్రయోగాలు చేయరనీ, నూత్న పద్ధతులను స్వీకరించరనీ, అర్థం కాదు. సాంప్రదాయికంగా ఉంటూనే, వర్ణాలలోను, పొందికలోనూ భిన్నభిన్న పద్ధతులలో ప్రయోగాలు చేస్తూ ... సృజిస్తున్నారు. తైలవర్ణాలలోను, నీటిరంగులలోను, టెంపెరా వర్ణాలలోను కూడా ఆయన సమానమైన సమర్థత చూపారు. కొన్ని తైలవర్ణ చిత్రాలలో ఆధునిక పద్ధతులనుకూడా అవలంబించారు. ఆయన ఇంకా తన్ను తాను అభివ్యక్తం చేసుకొనే మార్గంలో పనిచేస్తున్నారు. ఆయనకు విజయం కాంక్షిస్తున్నాను," అని శ్రీ రాజమన్నార్ ఉపన్యసించారు.

శ్రీ రాయ్ చౌధురిగారు ... రామగోపాల్ గారు ప్రయోగాలు చేస్తున్నా, అర్థరహితంగా ప్రయోగాలు చేసే వ్యక్తి కాదనీ, ఆయన చిత్రాల్లో మానవజీవితానికి హత్తుకుపోయే అనుభూతుల రూపకల్పనలు కనిపిస్తుందనీ అన్నారు.

ప్రదర్శనంలో ... చిత్రకళలో ... ప్రవేశం ఉండని వారికి ... ఒకటి ప్రదర్శింపబడింది. ఈ ప్రదర్శనం ఈ నెల 6 వ తేదీవరకూ ఉంటుంది.

# రెండు లారీల 'ఢీ' చిత్తూరులో ఒకని మరణం

చిత్తూరు, సెప్టెంబరు 2: పెద్ద బజారు వీధి తాలూకా కచేరీ వీధి కలిసే చోట నిన్న మధ్యాహ్నం 1-30 గంటల వేళ రెండు లారీలు ఢీకొట్టుకొన్నవి. లారీల డ్రైవర్లు యిద్దరు ప్రాణాపాయం తప్పించుకొన్నారు గాని ప్రక్కన తమలపాకుల అంగడివద్ద ఉన్న తంగవేలు అను వ్యక్తి మరణించాడు. అంగడి సొంతదారు నరేశనాయుడు, మరొక వ్యక్తి గాయపడ్డారు.

బజారు వీధి దాటి వేగంగా వస్తున్న బొగ్గులమూటల లారీని, దక్షిణం వైపు మలుపు తిరిగేచోట కూరగాయల లారీ ఢీకొట్టింది. బొగ్గులమూటల లారీ రోడ్డు వైపు దొర్లిపడిపోయింది. ఈ మూటల క్రింద చిక్కుకొన్న తంగవేలు మరణించాడు. ప్రక్కన ఉన్న యిద్దరికి గాయాలైనవి. పోలీసులు దర్యాప్తు చేస్తున్నారు.

## పప్పుపొట్టులవగు మతికిఅనుమతి

న్యూఢిల్లీ, సెప్టెంబర్ 2: ఊలవలతోపాటు అన్నిరకాల పప్పు దినుసుల పొట్టును ఎగుమతి చేసేందుకు అనుమతించటానికి భారత ప్రభుత్వం నిశ్చయించింది. వ్యవసాయమంత్రి డాII పంజాబ్‌రావ్ దేశ్‌ముఖ్ నేడు లోక్‌సభలో ఈవిషయం వెల్లడించారు. దేశంలో పశువులమేత కొరతగా ఉన్నప్పటికీ ఈపొట్టుకు . అక్కరలేదని ఆయన అన్నారు.

# ఈ ఏడాదిలో రూ 71 కోట్ల విదేశీసహాయం

## భారత ప్రభుత్వ నమ్మకం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 3: 1955-56 సం॥లో రు 70 కోట్ల 90 లక్షల సహాయం విదేశాలనుంచి లభిస్తుందని భారత ప్రభుత్వం భావిస్తున్నది. ఆర్థిక శాఖ పార్లమెంటరీ కార్యదర్శి శ్రీ బి. ఆర్. భగత్ నేడు లోక్‌సభలో శ్రీ శివమూర్తిస్వామి ప్రశ్నకు జవాబిస్తూ తెలియజేశారు.

ఈమొత్తంలో ప్రపంచ బ్యాంకులు ఇచ్చే అప్పులు కూడా చేరి ఉన్నవని ఆయన తెలియజేశారు. సగటున నూటికి సంవత్సరానికి 4 రూ వడ్డీవుంటుందనీ, మామూలుగా 10 ఏళ్లలో తీర్చవలసి ఉన్నా, కొన్నిటికి 15 సం॥ల వరకూ గడువు ఉన్నదనీ ఆయన వివరించారు.

## నందికొండ ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు

కర్నూలు, సెప్టెంబరు 3: ప్రస్తుతం పి. డబ్ల్యు. డి. శాఖలో తాత్కాలికంగా అసిస్టెంటు ఇంజనీరుగా పనిచేస్తున్న జె. ఎ. సుబ్రిగారిని, 4 నెలల సెలవు మీద వెడుతున్న జంబులింగంగారి స్థానే నందికొండ ప్రాజెక్టు ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుగా ప్రభుత్వం నియమించింది.

# కృష్ణా జిల్లా మార్కెటింగ్ సంఘం

విజయవాడ, సెప్టెంబరు 2: కృష్ణా జిల్లా మార్కెటింగు కమిటీకి ముండవ వెంకటరత్నంగారు అధ్యక్షులుగా, వలబోతు రామనాథంగారు ఉపాధ్యక్షులు ఏకగ్రీవంగా ఎన్నికైనారు. ఈ ఉదయం జిల్లాకలెక్టరు జనాబ్ అబ్దుల్ ఖాదర్ గారి అధ్యక్షతన కొత్తగా ఎన్నికైన సభ్యుల సమావేశంజరిగింది.

మొత్తం 12 మంది సభ్యులుగల ఈ సంఘంలో 6గురు రైతుల, 6గురు వర్తకుల ప్రతినిధులు. ఒకరిని ప్రభుత్వం నియామకం చేస్తుంది. జిల్లా వ్యవసాయ శాఖాధికారి అధికార పూర్వకసభ్యులు.

రైతు ప్రతినిధుల ఎన్నికలు 1954 సెప్టెంబరులో జరిగినవి. కోర్టు వ్యవహారాలవలన వర్తకుల ప్రతినిధుల ఎన్నిక 1955 ఏప్రిలువరకు పిలువబడలేదు. నియామకమైన సభ్యుని విషయంలో పేచీ ఏర్పడినందువల్ల అధ్యక్ష ఉపాధ్యక్షుల ఎన్నిక నేటివరకు జరగలేదు.

ప్రభుత్వం నియామకం చేసిన సభ్యులు వాసిరెడ్డి మహాదేవశాస్త్రిగారు.



Printed and Published for NageswaraRao Estates Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7 Thambu Chetty St. Madras - 1. Editor S. Sambhu Prasad